# హైందవ స్వరాజ్యము.

(మహాత్మ గాంధి విరచితము)

గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిచే

నాంగ్లమునుండి యనువాదింపబడినది.



ఉపేంద్ర ప్రచురణాలయము

౧౭, నారాయణ మొదలి వీధి

చెన్నపురి.

మొదటి ముద్రణము జూలై ౧౯౧౯ ప్రతులు ౧౦౦౦.

రెండవ ముద్రణము జూలై ౧౯౨౧ ప్రతులు ౨౦౦౦.

మొదటి మూడు ఫారములు "ప్రిన్టెర్సు ప్రెస్సు" లోను
౪, ౫, ౬ ఫారములు "వేదాంతా ప్రెస్సు" లోను
౭, ౮, ౯ ఫారములు "చదలవాడ సుందరరామ శాస్త్రులువారి
ప్రెస్సు" లోను ముద్రణముకాబడినది.

# పీఠిక.

ఆంధ్రభాషాలతలు దేశమందంతటను నల్లి బిల్లిగ నల్లుకొని యున్నతరి అందు రాజకీయ విషయికసూనంబులు కానరాకుంట శోచనీయము. హైందవ జాతీయత ప్రతిభారతీయుని అంతరాళముల రాణిల్లుచున్నయది. యుగంధరుని యుత్తమ రాజకీయతత్వజ్ఞత, తిమ్మరుసు రాజ్యాంగ నిర్మాణకౌశలము మనవారిరక్తనాళముల బ్రవహించుచున్నయది.

భారతదేశమున మనవారలె మున్ముందు దేశభాషల ప్రాముఖ్యతను కనుంగొనిరి. ముద్దులు మూటగట్టు మన తెలుంగే మనలనుద్బోధమునకు పురికొల్పగలదు. ప్రబోధంపుమొలకలు యిప్పుడిప్పుడే చిగిర్చి వికసించుచున్నవి.

పాశ్చాత్యులెల్లరును ఆధ్యాత్మికధర్మమును తూలనాడి ఇహమే నిశ్చయమని "నాగరికత, నాగరికత" యనిపేరు పెట్టుకొని తుదకు ఐరోపా మహాసంగ్రామమున ఒకరి నొకరు చిత్రవధల గావించికొనిరి. ఇప్పుడిప్పుడే వారికి వారి నాగరికత వట్టిమిధ్యయని గోచరమగుచున్నది. హైందవుల జీవనమే యుత్తమమని ఇప్పుడే వారు కన్నులు విప్పిచూచుచున్నారు. మనము భారతసందేశమును లోకమంతటికిని

గొంపోవలసియున్నది. అట్టి సందేశమును గొంపోవ గాంధి మహామహులుద్భవించిరి. వారు అవతారపురుషులు. వారి కీర్తి లోకమున దివ్యకీర్తుల ప్రసరించి భారతసందేశముంగొంపో వును. అట్టితరి వారిచే రచియింపబడిన "హైంరవ స్వారాజ్యము "ను ప్రచురించుటయే యుత్తమమనితలంచి మేమట్లొన రించితిమి.

ఈ మానూతనోద్యమమునకు సుధీ లోకమెల్ల ప్రోత్సాహ మొసంగి మమ్ము ఇకముందు నిట్టి యుత్గ్రంధముల ప్రకటించు నటుల చేయుదురుగాక యని ప్రార్థించుచు యీ చిన్నపొత్తం బును బంధింపబడిన మనమాతకు నంకితంబుగావించి విరమించు చున్నారము.

చెన్నపురి, }
౨-౭-౧౯౧౯. } శ్రీవాసంతగ్రంథనిలయము.

---

రెండవముద్రణపు పీఠిక.

ఆంధ్రదేశమునందనేకులకు సులభలభ్యంబగుటకు రెండవ ముద్రణమును వేయించి చాల చౌకధరకిచ్చుచున్నారము. ఆంధ్రలోకము మాయుద్యమమునకు ప్రోత్సాహము నొసంగు కోరుచున్నారము.

ఉపేంద్రప్రచురణాలయము.

# హైందవ స్వరాజ్యము.

## మొదటి ప్రకరణము.

---

### దేశీయ మహాసభ : తదధికారులు.

చదువరి : నేటిదినము మనభూమిలో ప్రజలు స్వరాజ్యము స్వరాజ్యము అని బహుభంగుల మాట్లాడుకొనుచున్నారు. అందుకై అందరు వాపోవుచున్నట్లున్నది. దక్షిణాఫ్రికాలో మఱి యితర ప్రాంతములలోకూడ ఇదేరీతిని మనవారు ఆశల తోనున్నారు. భారతభూమి స్వాతంత్ర్యములకు ఆతురపడు చున్నది. తమ రీవిషయమున అభిప్రాయమిత్తురా ?

సంపాదకుడు : ప్రశ్న చక్కగానడిగితిరి. ప్రత్యుత్తరమి చ్చుటమాత్రమంత సులభముగాదు. పత్రికాధికారులకు మూడు ముఖ్యధర్మములు కలవు. లోకుల అభిప్రాయములను కనిపెట్టి వెలిబుచ్చుట యొకధర్మము; ప్రజలలో సక్రమములు సమం జసములు నగు క్రొత్తయాశయములను జనింపజేయుట మరి యొక ధర్మము; ప్రజలకుగల కష్టనిష్ఠూరములను జంకు కళంకు లేక బహిరంగపరచుట మూడవధర్మము. మీ ప్రశ్నకు ప్రత్యుత్తరము చెప్పుటలో ఈ మూడుధర్మములును నేక కాల మున నెరవేర్చవలసివచ్చుచున్నది. కొంతవరకు ప్రజలసంకల్ప

మును బహిరంగపరచవలెను. కొంతవరకు కొన్ని యుద్బోధన లనుప్రకటింపవలెను. కొన్నికొన్ని కష్టనిష్ఠూరములను విమర్శింప వలెను. మీరు ప్రశ్నయడిగితిరి గావున ప్రత్యుత్తరమిచ్చుట నావిధి.

చదువరి : అట్లయిన మనలో స్వరాజ్యమునకయి అభిలాష జనించిన దనియేకదా మీ యభిప్రాయము.

సంపా: ఆ యభిలాషయే దేశీయమహాసభకు పుట్టువు కల్పించినది. "దేశీయ" మను పదప్రయోగమే దానిని వెలిబుచ్చుచున్నది.

చదువరి : మీరు చెప్పునది సరిగాదు. నవయౌవనభారత భూమి దేశీయమహాసభను అలక్ష్యముతో చూచునట్లున్నది. అది బ్రిటిషు పరిపాలనను అనంతముచేయు సాధనమని ఇప్పటి యౌవనులు తలంచుచున్నట్లున్నారు.

సంపా : ఆయభిప్రాయము న్యాయముకాదు. భారతపితా మహుండగు మన దాదాభాయి నౌరోజి శంఖుస్థాపనచే యనిచో నేటిదినము మన యౌవనులు స్వరాజ్యమును గురించి మాటలాడుటకైనను అవకాశముండియుండదు. ఆ హ్యూము మహాశయుడు వ్రాసినది మనము మరువజాలము. ఆతడు మనలను కార్యదీక్షకు బురికొల్పినది స్మరింపక వీలులేదు. దేశీయమహాసభోద్దేశములను సాధించుటకు ఆత డెంతప్రయ

త్నముమీద మనలనుద్బోధించినదియు మనకు సంస్మరణీయమే. అల్లే సర్ విల్లియము వెడ్డరబరనుకూడ తన ధనమానప్రాణములను మనకొరకు వినియోగించినాడు. అతడు వ్రాసినవిషయములు నేటికిని సమాదరణీయములై యున్నవి. గోకలే పండితుడు మన హైందవజాతిని స్వరాజ్యమునకు సిద్ధముచేయుటకయి దారిద్ర్యవ్రతమును పూని యిరువది సంవత్సరములకాలమును మనకై ధారపోసెను. దేశీయమహాసభ మూలకముగా ఈ భూమిలో స్వరాజ్యబీజములను చల్లినవారిలో కీర్తిశేషులైన న్యాయమూర్తి బద్రుద్దీను తయాబ్జి యొక్కడు. ఇదేవిధముగా బంగాళములో, మద్రాసులో, పంజాబులో మరి యితరప్రాంతములలలో భారత భూమియంతటను హైందవదేశమిత్రులును దేశీయసభాభిమానులునునైన హైందవులును ఆంగ్లేయులును నుందురు.

చదువరి : నిలుడు. నిలుడు. మీరు కడుదూర మరుగుచున్నారు. నాప్రశ్నకును మీరిచ్చునుత్తరమునకును ఎక్కడెడమేర్పడుచున్నది; నేను మిమ్ముననడిగినది స్వరాజ్యమునుగురించి. మీరుప్రత్యుత్తరము చెప్పుచుండునది పరులపరిపాలననుగురించి. ఇంగ్లీషుపేళ్లు నాకు విననక్కఱలేదు. మీరు వానిని చెప్పుచున్నారు. ఇట్లుండుటచేత మీకు నాకు పొత్తుపొసగునని తోచదు. మీరు దయచేసి స్వరాజ్యము విషయము మాత్రము

మాట్లాడినయెడల సంతోషము. తక్కిన "శిష్ట" సంభాష ణయంతయు నాకెత్తి కెక్కదు.

సంపా: ఈతొందరపాటు వలదు. నేనును మీరీతినుండ రాదు. కొంచెము ఓపికపట్టితి రేని మీకు కావలసినదే నేనును చెప్పుట మీరెరుఁగ గలరు. చెట్టొక్కనాట పెరుగదు. నన్ను మీరు అభ్యంతరపెట్టుట, హైందవభూమి మిత్రులను గురించి మీరు విననొల్లకుండుట, చూడగా(మీసంగతి తీసికొనునెడల) స్వరాజ్యము కడుంగడుదూరమగునట్లు తోఁచుచున్నది. మీ వంటివారనేకులుండినయెడల మనమొక అడుగైన ముందుకు పెట్టియుండము. ఈసంగతిమాత్రము జ్ఞాపకము పెట్టుకొనుడు.

చదువరి: మీధోరణి చూడగా లోకాభిరామాయణము మాట్లాడి నాకు జవాబు ఎగగొట్టునట్లున్నది. మీకు ఎవరు దేశమిత్రులుగా దోఁచుచున్నారో వారు నాఅభిప్రాయము ప్రకారము దేశమిత్రులు గారు. అట్లుండగా వారినిగురించిన మీ ప్రసంగము నేను వినవలసినపని యేమి? మనజాతికంతయు పితామహుడని మీరనునట్టి యతఁడు ఆజాతి కేమిచేసినాడు? అతఁడు చెప్పినదంతయు ఇది: "ఇంగ్లీషుపరిపాలకులు న్యాయముచేయుదురు. వారికి సహాయముకండు".

సంపా: తిన్నగా చెప్పినను దృఢముగా చెప్పుచున్నాను. అంతటిమహానుభావునిగురించి నీవింత అవకతవకగా సంభా

పించుట వ్రీడాకరము. అతడు చేసినపని స్మరించుకొనుము. తనజీవితమునే అతడు దేశమునకై సమర్పించినాడు. మన కిప్పుడుకల జ్ఞానము అతడు పెట్టినభిక్ష. ఆంగ్లేయులు మన సారమును పీల్చి మనలను పిప్పిచేసిరనుట మనకు దెల్పిన వాడు దాదాభాయియే: కడపటివరకును ఆంగ్లజాతియందు అతనికి నమ్మకమున్నంతమాత్రమున నదియొకదోషమా? మనకు కండ కావరముండి ముందు కొకయడు గెక్కువగా పెట్టగల్గినంతనే దాదాభాయి గౌరవమునకు హానిగల్గునా ? ఆమాత్రముచేత మన మతనికంటెను వివేకులమా ? వివేకులైనవారి కొకటే గుర్తు. వారెక్కివచ్చిన నిచ్చెనను వారెప్పుడును పడదన్నుకొనరు. మెట్లలో నొకమెట్టు నశించినను మెట్లన్నియు విడిపడును. శిశువులుగానుండి పెద్దయయినపిదప మనము శిశుస్థితిని తృణీకరింపము. నాటిసంగతి సందర్భములు స్మరించుకొని ఆనందించుచుందుము. బహుకాలము నేర్చుకొని గురుపు మనకు పాఠములు చెప్పును. దానిపై మనము మరికొంతదూరము జ్ఞానమభివృద్ధిచేసికొందుము. ఆయన వేసిన పునాదులపైన నేను కొంతయెక్కువ కట్టుకొనినమాత్రాన నేను ఎక్కువ వివేకి యగుదునా ? అతడెప్పుడును నాకు గౌరవనీయుడేకదా ! మన భారతపితామహుడగు దాదాభాయిసంగతియు నింతే. అతడు భారతజాతీయ నిర్మాత యని యంగీకరింపక తప్పదు.

చదువరి: మీరు చక్కగా చెప్పితిరి. దాదాభాయి గౌరవనీయుడని నాకిప్పుడు అర్థమయినది. అతడును మరియాతనివంటి వారును లేనియెడల మన కీనాడుగల యుత్సాహము కలిగియుండక పోవచ్చును. అయిన గోకెలేనుగురించి ఇట్లు చెప్పను రాదు. అతఁడు ఇంగ్లీషువారికి గొప్ప స్నేహితుఁడు. స్వరాజ్యమునుగురించి మాట్లాడుటకు ముందు మనము వారిదగ్గరనుండి ఎంతో నేర్చుకొనవలెననియు వారిరాజకీయ వివేకమును సంపాదింపవలెననియు అతడు చెప్పెను. అతని యుపన్యాసములు చదివిచదివి నాకు వెగటుపుట్టినది.

సంపా: అట్లు వెగటు పుట్టినయెడల అది మీయసహనమునకే ద్యోతకముగా నున్నది. తల్లిదండ్రులు మెత్తగా నాలోచన చేయుదు రనియు వారు తమతో పరుగెత్తిరనియు కోపించు కొనుబిడ్డలు తల్లిదండ్రుల నగౌరవపరచువా రనికదా మనము నమ్ముచున్నాము. గోకెలేపండితుడు పితృవర్గము లోనివాడు. అతఁడు మనతో పరుగు లెత్తలేదని మనమేవగించుకొననగునా? స్వరాజ్యమును కోరునట్టిజాతి పితృవర్గము నెప్పుడును నుల్లంఘింపతగదు. పూర్వికులయెడ మర్యాదలేనినాడు మనము వ్యర్థులముగాని మరివేరుగాము.ఆతురపాటుగలవారుఆత్మసామ్రాజ్యమేలజాలరు. భావపరిపాకముగలవారలకే అయ్యాది తగును. మరియొకమాట. గోకెలేమహాశయుడు తన సర్వస్వమును మన

విద్యకయి ధారపోయునపుడు అట్టివారు ఈదేశమున నెందరుం డిరో వ్రేలుమడిచి చెప్పగలరా ? గోకెలేమహాశయు డేమిచేసి నను సరియే పవిత్రోద్దేశముతోను మాతృసేవాదృష్టితోను చేసి నాడనుట నాదృఢవిశ్వాసము. అతనిమాతృభక్తి యపారము. దేశమాతకు ప్రాణమైనను సమర్పించుట కతడు సంసిద్ధుడు. అత డేమి పల్కినను పరసంతోషమునకయి పలుకువాడు కాడు. తనకు న్యాయమని తోచినదే చెప్పువాడు. కాబట్టి యతని యెడల మనకు సంపూర్ణాదరము అత్యవసరము.

చదువరి : అట్లైన మన మతనిపాదముల బట్టి యన్నివిషయ ములలోను నడువవలసినదేనా ?

సంపా : నే నామాట చెప్పనేలేదు. ఎందులోనైనను మన యాత్మసాక్షి ఆతని పథమునుండి వేరుపడెనా అప్పుడు తదను గుణముగా నడువవలసినదేయని అతడే మనకు బోధించియుం డును. అతడు చేసినపనిని దూరకుండ, ఆతనితో పోల్చుకొను నెడల మనము మిక్కిలి యల్పజ్ఞులమగుటను స్మరించుకొను టయే మనము చేయవలసినది. అనేకులు వ్రాయుసకాంత్రము అత నిని ఉల్లంఘించి వ్రాయుదురు. ఆవ్రాతలకు మనము అసమ్మతి దెల్పుట కరణీయము. గోకెలే మహానుభావునివంటివారలను మనము స్వరాజ్యసౌధముయొక్క ముఖ్యస్తంభములుగా నాలో చింపవలెను. మనమాట బంగారుమాట, ఇతరులమాట వృధ

యగుబూటక మనుకొనుట దురభ్యాసము. అభిప్రాయభేదమాత్రమున ఎదుటివారు దేశద్రోహులనుటయు నిట్టిదియే.

చదువరి: తమయర్థము నాకిప్పుడొకకొంచెము స్ఫురించుచున్నది. నేను ఇంకను ఆలోచించుకొనవలసియున్నది. కాని మీరు హ్యూమునుగురించియు సర్ విల్లియము వెడ్డరబరనును గురించియు చేయుసంభాషణ నాకేమియు గోచరింపలేదు.

సంపా: హిందువుల విషయములో ఏ తత్త్వము పనికివచ్చినదో ఇంగ్లీషువారి విషయములోకూడ ఆతత్త్వమే పనికివచ్చును. ఇంగ్లీషువారందరు చెడ్డవారని నే నెప్పుడు చెప్పనొప్పుకొనను. వారిలో అనేకులు భారతభూమికి స్వరాజ్యము కోరువారున్నారు. ఇతరులకంటె ఇంగ్లీషువారికి కొంచెమెక్కువ స్వార్థపరత్వ మున్నదనుట నిజమే కాని ఆమాత్రముచేత ఇంగ్లీషువారందరు చెడ్డవారు కారు. న్యాయము మనకు చేయమని ఇతరులను కోరునప్పుడు మనమును ఇతరులకు న్యాయము చేయవలెను. సర్ విల్లియము భారతభూమికి చెడుగుకోరడు. అదియే మనకు చాలును. మనము న్యాయముగా నడుచుకొనునెడల మనకు స్వాతంత్ర్యము శీఘ్రతరముగా కలుగును. అది మీకు ముందు తెలియగలదు. ప్రతి ఇంగ్లీషువానిని మనశత్రువుగా దూరముచేయునెడల స్వరాజ్యము దూరము పోవును. అదియు మీకు ముందు తెలియగలదు. కాని మనము వారి

యెడ న్యాయముగా నుండు పట్ల మనఉద్దేశము నెరవేర్చుకొను టలో మనకు వారిసహాయము లభింపగలదు.

చదువరి: ఇప్పుడు ఇదంతయు నాకు వట్టిపిచ్చిగా దోచుచున్నది. స్వరాజ్యము ఇంగ్లీషుసహాయము ఇవిరెండు పరస్పర విరోధములు. మనకు స్వరాజ్యమురాగా చూచి ఇంగ్లీషువారెట్లు సహింపగలరు? అయిన ఆవిషయము మీ రిప్పుడు నాకు నిర్ధారణచేసి చెప్ప నక్కరలేదు. దానివిషయమై కాలహారణ మొనర్చుట వ్యర్థము. మనకు స్వరాజ్యము ఎట్లువచ్చునో మీరు చెప్పునప్పటికి నాకది అర్థముకావచ్చును. ఇంగ్లీషు సహాయము సమాచారము మాట్లాడినదానివలన మీయెడల నాకు కొంతవ్యతిరేకభావము కలిగినది. కాబట్టి ఈవిషయమే యెక్కువగా చెప్పుచునుండవలయు.

సంపా: నాకు ఆవిషయమున నింకను ప్రసంగింపవలయు నను ఆశ లేదు. మీకు నాయెడ విరుద్ధభావ మేర్పడినంతట నాకు వ్యసనములేదు. మొట్టమొదటనే తీపిగానిమాటలు చెప్పుట మంచిది. శాంతముగాసహనముతో మీవిరుద్ధభావమును తొలగించుట నావిధి.

చదువరి: మీరు కడపట చెప్పినవిషయమునకు సంతోషము. నాకుదోచినట్లుదాపరికము చేయక మాట్లాడుట కది నాకు అవకాశ మొసగుచున్నది. ఒక్కవిషయ మింకను నాకర్థము

కాలేదు. దేశీయమహాసభ యెట్లు స్వరాజ్యమునకు బునాది వైచినదో తెల్పుడు.

సంపా: చూతము. దేశీయమహాసభ భారతభూమినాలుగు చెరగులనుండి దేశపుత్రులను నొక్కచోట చేర్చెను. మనమందర మొక్కజాతియను నుత్సాహమును మనకు కలుగజేసెను. ప్రభుత్వమువారికి ఆసభయెడల అసూయయే. దేశాదాయమును దేశవ్యయమును ప్రజాప్రతినిధులే నిర్ణయింపవలెనని ఎప్పుడును ఆసభ కోరినది. కనడాలోవలె ఇక్కడ స్వపరిపాలన యేర్పడవలెనని యెప్పుడును అడుగుచు వచ్చినది. మనకు అది దొరకునా లేదా, అదేమంచిదా కాదా, దానికంటె మంచిది మరియొకటి కలదా యిత్యాది ప్రశ్నలు ఇట అనవసరము. మనము గమనింపతగినది ఒక్కటేవిషయము. దేశీయమహాసభ మనకు స్వరాజ్యముచవి ఇట్టిదనుటను ప్రకటించినదా? లేదా? ఆకీర్తి తత్సభకు లేక చేయుట న్యాయముకాదు. మనమును ఆప్రయత్నము చేయుదుమేని కృతఘ్నులమగుటయేగాక మనయుద్దేశపరిపూర్తినిగూడ దూరముచేసికొనినవారమగుదుము. దేశీయమహాసభ మనజాతీయాభివృద్ధికి విరోధియనియెంచుట దానిని మనము వినియోగించుకొనుభాగ్యము పోగొట్టుకొనుటయగును.

# రెండవ ప్రకరణము.

## బంగాళా విభజనము.

చదువరి : మీరు చెప్పు వైఖరిని ఆలోచించినయెడల దేశీయమహాసభ స్వరాజ్యమునకు పునాదులు వైచినదనుట న్యాయముగానున్నది. అయిన దానివలన నిజమైనప్రబోధము కలిగినదని అనుటకురాదు. మీరును దీనిని అంగీకరింతు రనుకొనెదను. ఎప్పుడు ఏవిధముగా ఆ నిజమయిన ప్రబోధము కలిగినదో చెప్పుదురా?

సంపా : విత్తన మెప్పుడును ప్రకటముకాదు. దాని పని యంతయు భూగర్భమున జరుగుచున్నది. తరువాత విత్తనము నాశమందుచున్నది. విత్తనమునుండి బయలుదేరు వృక్షము మాత్రము పైకినిక్కి కానవచ్చును. దేశీయమహాసభసంగతిలో గూడ ఇట్టి స్థితియే కానగును. అయినప్పటికిని మీరు ఏది నిజమైన ప్రబోధమని అనుకొనుచున్నారో అది బంగాళావిభజనమునకు తరువాత కలిగినది. అందులకుగాను మనము కర్జను ప్రభువునకు కృతజ్ఞులమై యుండవలసియున్నది. విభజనకాలమున బంగాళీలు కర్జనుగారికి సంగతిసందర్భములు విశదీకరించిరి. కాని అతనికి అధికారగర్వమున్నందున వారు చెప్పి

నది వంట బట్టలేదు. వారి ప్రార్థనలు నిరాకృతములయ్యెను. హైందవులు ఊరక వదరకలరుగాని కార్య మేమి చేయగలరని అతడు పరాఙ్ముఖుడయ్యెను. అవమానకరభాషణముచేసి అతడు బంగాళమును విభజించెను. నాటిదినమును బ్రిటిషుసామ్రాజ్య విభజన దినమనుకొనవచ్చును. ఈ బంగాళా విభజనమున బ్రిటిషు అధికారమునకు కలిగిననష్టము మరిదేనివలనను కలుగ లేదు. హైందవభూమికి జరిగిన ఇతరాన్యాయములు బంగాళా విభజనమునకంటె తక్కువవి యని ఇందువలన తలంపరాదు. ఉప్పు పన్ను చిన్న యన్యాయముకాదు. ముందుకు ఇట్టివింకను ఎన్నియో వివరింతును. ప్రస్తుత మనుసరింతము. బంగాళా విభజనమును ఎదుర్చుటకు ప్రజలు సిద్ధముగానుండిరి. సంవేదనలు తీక్ష్ణ మయ్యెను. బంగాళీ లనేకులు తమ సర్వస్వమును సమర్పింప సిద్ధమైరి. స్వశక్తివిజ్ఞానము కలిగినందున తైక్ష్ణ్యము అపారమయ్యెను. ఇప్పుడా తైక్ష్ణ్యము అడంపరానిదైనది. అడంప నవసరమునులేదు. బంగాళా విభజనము పోవుట సిద్ధము. బంగాళీలకు పునస్సమాగమము సిద్ధము. కాని ఇంగ్లీషు పరిపాలన నౌకలో ఏర్పడిన రంధ్రముమాత్రము మూతపడదు. అది దినక్రమముగా పెద్దది యగును. ప్రబోధితమైన హైందవ భూమి మరల సుషుప్తి జెందబోదు. బంగాళావిభజనము రద్దు చేయగోరుట స్వరాజ్యమును గోరుటయే. బంగాళనాయకులు

దీని నెరుంగుదురు. అధికారులు దీనిని గుర్తించినారు. అందు చేతనే బంగాళావిభజనము పోలేదు. కాలక్రమమున హైందవ జాతి బలవత్తరముగ ఏర్పడుచున్నది. రాష్ట్రములొక్కనాట నిర్మితములు కావు. సంవత్సరములు పట్టును.

చదువరి: బంగాళా విభజనఫలములేమి యని మీయభి ప్రాయము.

సంపా : నాటివరకు మనకు తెలిసియుండినదిది. మనకష్ట నిష్ఠూరాలు తీర్చుకొనుటకు మనము చక్రవర్తిగారివరకు అర్జీ చేసుకోవలసినది. ప్రతీకారము లేకపోయినఎడల ఊరక కూర్చొని మరలమరల అర్జీ చేసుకోవలసినది. బంగాళా విభ జనకు తరువాత ప్రజలకొకసంగతి తెలిసినది. అర్జీలకు బునాది గా మనశక్తిఏర్పడవలెను. మనము కష్టపడుటకు వెనుదీయ రాదు. ఈక్రొత్తతేజస్సే విభజనముయొక్క ముఖ్యఫలము. ఈఫలము నిర్భయముగా పత్రికలలో ప్రకటితమైనది. ప్రజలు లోలోన రహస్యము రహస్యముగా గుజగుజలాడుకొనినది బహిరంగముగా నిర్భీతిగా వ్రాయంబడినది. ప్రకటనసందినది. స్వదేశోద్యమము ప్రారంభమయినది. ముందు పిల్లలుపెద్దలుఅం దరు ఇంగ్లీషువారిముఖము చూచిన భయముతో వరుగెత్తు చుం ఇప్పుడా భయముపోయినది. తగాదావచ్చినను ఇప్పుడు లక్ష్యములేదు. జైలుకుపోవలసినను లక్ష్యములేదు. భారత

భూమి యుత్తమపుత్త్రిలలో కొందరు ఇప్పుడు ప్రవాసములలోను న్నారు. వట్టి అర్జీలుపెట్టుకొనుటకును దీనికిని ఎంతో తారతమ్య మున్నది. ప్రజలీవిధముగా మారినారు. బంగాళములో పుట్టిన నవశక్తి ఉత్తరమున పంజాబుకు, దక్షిణమున కన్యాకుమారికి వ్యాపించినది.

చదువరి: మరియేస్ఫుటమైన ఫలమైనను కలిగినదందురా?

సంపా: బంగాళావిభజనము ఇంగ్లీషునౌకలో రంధ్రముతొల చుటే కాక మననౌకలో కూడ రంధ్రమును తొలచినది. మహా సంభవములకు మహాఫలములు దప్పవు. మననాయకులు రెండు కక్షులయినారు——మితవాదులు, జాతీయవాదులు. ఒకటి మంద గామి మరియొక్కటి శీఘ్రగామి యనవచ్చును. కొందరమత మున మితవాదులు భయస్థులు, జాతీయవాదులు పోటరులు. ఎవరియెవరి ఆలోచనలుబట్టి వారువారు వీనికర్థముచెప్పుదురు. ఒక్కటిమాత్రము నిజము. ఈరెండు తెగలవారికిని వైరుధ్య ము గలిగినది. పరస్పరము అవిశ్వాసపడుచు ఈరెండుకక్షు లొండొంటిని దూషించుకొనుచున్నవి. సూరతు దేశీయమహా సభసమయమున రమారమి యుద్ధమేపొసగినది. ఈవిభేదము దేశమునకు మంచిదికాదనియే నాయభిప్రాయముకాని ఇట్టి విభేదములు ఎంతోకాలము నిలుచునవియు గావు.

## మూడవ ప్రకరణము.

### అసంతృప్తి, అశాంతి.

చదువరి : అట్లైన బంగాళావిభజనము ప్రబోధమునకు కారణమని మీరంగీకరించుచున్నారు. అందువలన కలిగిన అశాంతి మీకు సమ్మతమేనా ?

సంపా : నిద్రనుండి మేల్కాంచువాడు అంగమును విరుచుకొనుచు లేచును. ఆవల ఈవలపొర్లాడును. పూర్తిగా లేచునప్పటికి ఒకకొంతసేపు పట్టుచున్నది. అటులే బంగాళావిభజనము ప్రబోధము కలిగించినను మేల్కొనుటకు సంబంధించిన వికారములు మాత్రము వీడలేదు. ఇంకను మనము అంగములు విరుచుకొనుచు ప్రక్కపై పొరలుచునున్నాము. నిద్రకు జాగ్రత్తకు మధ్యమావస్థ ఎట్లవసరమో అట్లు యీయవస్థయు మన పరిణామమున అవసరము ఉచితము అగుచున్నది. ' అశాంతి కలదు.' అను జ్ఞానమే దానిని తరించుటకు మార్గము కాగలదు. నిద్రి మేల్కాంచుట కారంభించిన పిదప అరగనుమోడ్పుతో నెంతో కాలముండము. త్వరగానో కొంచెమాలస్యముగనో మనమన శక్తికొలది సంపూర్ణజాగ్రదవస్థను పొందుచునే యున్నాము.

అందుచేత, ఎవ్వరును వలెననికోరని యట్టి యీయశాంతస్థితిని మనము తరింపగలము.

చదువరి: మరి యింకొకవిధమైన అశాంతికలదా? దాని స్వరూప మెట్టిది?

సంపా: అశాంతి నిజముగా అసంతృప్తి. అసంతృప్తినే అశాంతి యనుచున్నారు. దేశీయమహాసభయుగమున దీనికి అసంతృప్తియనుపేరు కలిగినది. హ్యూము ఈయసంతృప్తివ్యాపన మత్యావసరమని యెల్లప్పుడును చెప్పుచుండువాడు. ఈ యసంతృప్తి మిక్కిలి యుపయోగకారి. మానవుడు తనప్రస్తుత స్థితికి సంతసించునెడల అతనిని దానినుండి బయటకు లాగుట కష్టము. కాబట్టియే ప్రతిసంస్కారమునకును అసంతృప్తి ప్రథమాధారము. మనకెప్పుడు వస్తువుపై ననిష్టముజనించునో అప్పుడుకాని మనము దానిని పారవేయము. హైందవులలో ఆంగ్లేయులలో ఉద్దండులైనవారు వ్రాసిన దానిని చదివినమీాదట మనకు అసంతృప్తి జనించినది. అసంతృప్తివలన అశాంతికలిగినది. ఈరెండవది కారణముగ ఎన్నియో మరణములు ఎన్నియో కారాగృహశిక్షలు, ఎన్నియో ప్రవాసములు సిద్ధించినవి. అట్టిస్థితి ఇక ముందును కొంతకాలము తప్పదు. అది సహజము. ఇవన్నియు మంచిసూచనలే యగును కాని వీనివలన దుష్టఫలములు కూడ కలుగవచ్చును.

## నాలుగవ ప్రకరణము.

### స్వరాజ్యమనగా నేమి?

చదువరి: దేశీయమహాసభ భారతభూమికి జాతీయభావమును కల్గించుటయు బంగాళవిభజనము ప్రబోధమును కల్గించుటయు అసంతృప్తి అశాంతులు దేశమున ప్రబలుటయు అను నీ విషయములనుగురించి నేనిప్పటికి తెలిసికొనినాను. స్వరాజ్యమునుగురించి తమ యభిప్రాయము లేవియో వినగోరుచున్నాను. మన ఇరువుర యభిప్రాయములును ఈవిషయమున నేకములు గావని నాకు దోచుచున్నది.

సంపా: మనమిరువురము ఈ స్వరాజ్య మనుపదమునకొక్కటే యర్థము చెప్పమనుట సంభావ్యము. నేను, మీరు, హైందవులెల్లరు, స్వరాజ్యము సంపాదింపవలయునని ఆతురులమై యున్నారము. కాని స్వరాజ్యమనగా నిదమిద్ధమని యెవ్వరును నిశ్చయించలేదు. ఇంగ్లీషువారిని ఇండియానుండి వెడలగొట్టుట స్వరాజ్యమని అనేకుల ముఖగళితమై యున్నది. కాని వారు అదే స్వరాజ్యమేలకావలయునో చక్కగా నాలోచించినట్లు లేదు. మిమ్ము నొకప్రశ్న యిప్పుడే అడుగవలెను. మనము

కావలసిన దంతయు వచ్చునెడల ఇంగ్లీషువారిని వెళ్లగొట్టుట మీకు అవసరమని తోచుచున్నదా?

చదువరి: నేను వారికి ఒక్కప్రార్థనయే చేయుదును. "దయచేసి దేశము విడిచి వెళ్లిపొండు" ఈ ప్రార్థన నంగీకరించిన తరువాత వారు వెళ్ళిపోవుట యనిన ఇచ్చటనేయుండుటయని అర్థమగునేని నాకభ్యంతరముండదు. అప్పుడు మన భాషప్రకారము పోవుటయనగా ఉండుటయని యర్థమగునని నాకు తెలిసియుండును.

సంపా: కాని, ఇంగ్లీషువారు వెళ్లిపోయినారని యనుకొందము. తరువాత మీరేమిచేయుదురు.

చదువరి: ఆప్రశ్నకు ఇప్పుడర్థము చెప్పుటకు రాదు. వారి వెళ్లిపోవువిధమునుబట్టి వారు వెళ్లిపోయినమీదట నుండుస్థితి యేర్పడగలదు. మీ రనుకొనురీతిని వారు ఇచ్ఛగా వెళ్లిపోవునెడల వారి రాజకీయసంస్థల నట్లే యుంచుకొందుము. పరిపాలన చేసి కొందుము. మనము అడుగుటతోనే వారు వెడలిపోవునెడల మనకు కావలసిన సైన్యాదికములు చేజిక్కును. పరిపాలనసాగించుట తరువాత మనకు కష్టము కాకూడదు.

సంపా: మీరట్లనుకొనవచ్చును, కాని అది నామనస్సునకు సరిపోలేదు. అయినను ఆవిషయమునుగురించి ఇప్పుడే చర్చచేయ దలపెట్టలేదు. మీ ప్రశ్నకు నేను ప్రత్యుత్తరము చెప్ప

వలసియున్నది. మిమ్ము ను ప్రతిప్రశ్నలడుగుటచేతనే ఆపనిని నిర్వహింతును. ఇంగ్లీషువారిని మీరేల వెడలగొట్ట వలెనను చున్నారు.

చదువరి: వారి పరిపాలనవలన భారతభూమి దరిద్ర దేవత పాలైనందుచేతనే. వారు సంవత్సరము సంవత్సరము మన ద్రవ్యము తీసికొనిపోవుచున్నారు. దేశములోని ఉత్తమోద్యోగములు తామే యనుభవించుచున్నారు. మనల బానిసలుగా పెట్టిపెట్టినారు. మనయెడల వారు తృణీకారభావముతో ప్రవర్తింతురు. మనమాట వారికి లక్ష్యమేలేదు.

సంపా: వారు మనద్రవ్యమును తీసికొనిపోక నయముగా ప్రవర్తించుచు మనకు గొప్ప యుద్యోగములిచ్చి పరిపాలన చేయునెడల వారిక్కడనుండుట చెరుపని మీరు తలంచెదరా?

చదువరి: ఈప్రశ్నలకు అర్థములేదు. పులి స్వభావమును మాన్చుకొనునెడల దానితో సహవాసము చేయుటలో దోష ముండునా? అని యడిగినట్లున్నది. ఇది వృథా ప్రశ్న. పులి నైజము మారునట్లైన ఇంగ్లీషువారి నైజమును మార వచ్చును. ఇది సాధ్యముకాజాలదు. సాధ్యమని నమ్ముదు మేని అది యనుభవ వ్యతిరేకము.

సంపా: కనడావారికి దక్షిణాఫ్రికావారికి కలయట్టి స్వారా జ్యపద్ధతి మనకు సిద్ధించునట్లైన చాలునా?

చదువరి: ఈప్రశ్నయు వ్యర్థమే. సంపూర్ణ స్వరాజ్యము నకు కావలసిన శక్తులు మనకున్నప్పుడే ఇది సాధ్యము. అప్పుడు మన పతాకమునే యెత్తవచ్చును. జపాను ఎట్లున్నదో భారతభూమి అట్లుండవలెను. నౌకాసైన్యము భూసైన్యము అన్ని మనవిగానుండవలెను. మన తేజోవికాసము మనకుండి ననే భారతభూమిపేరు లోకమున మ్రోగ గలదు.

సంపా: మీరు విషయము బాగుగనే చిత్రించినారు. మీ యర్థమిది. మనకు ఇంగ్లీషువా రక్కఱలేదు. వారి పరిపాలన పద్ధతి కావలెను. వ్యాఘ్రస్వభావము కావలెను. వ్యాఘ్రి మక్కఱలేదు. భారతభూమిని ఇంగ్లీషు చేయుదురు. అప్పుడు ఇది హిందూస్థానము కాదు. ఇంగ్లీషు స్థానమగును. నేను కోరు స్వరాజ్యము అది కానేరదు.

చదువరి: నాయభిప్రాయమున స్వరాజ్య మెట్లుండవలెనో చెప్పినాను. మనము చదివేచదువు ఉపయోగకరమేని, మిల్లు, స్పెన్సరు ఇతర ఇంగ్లీషుగ్రంథకర్తలు అనుకరణీయులేని, ఆంగ్ల రాజ్యాంగసభ అట్టిసభలన్నిటికిని మాతృకయేని, మనము ఇం గ్లీషువారిని బాగా అనుకరింపవలసినదే. వారు తమభూమిలో నెట్లు ఇతరులను కాలూన నీయరో మనము వారినిగాని మరి యితరులనుగాని మనభూమిలో కాలూన నీయరాదు. వారు వారిదేశములో చేసినంత పని ఇతరదేశములలో ఎక్కడను జరు

గలేదు. కాబట్టి వారిసంస్థలు తెచ్చుకొనుట మనకు చేయ తగినపని. మీ యభిప్రాయ మేమి?

సంపా: ఓపిక పట్టియుండవలెను. సంభాషణవృద్ధి కాగా కాగా నా యభిప్రాయములు వెల్లడియగును. స్వరాజ్య మనగా అర్థముచేసికొనుట మీ కెంత సులభముగా తోచు చున్నదో నాకంత కష్టముగానున్నది. కాబట్టి ప్రస్తుతము మీరేది స్వరాజ్యమని భ్రమపడుచున్నారో అది నిజముగా స్వరాజ్యముకాదని ఋజువు చేసెదను.

# ఐదవ ప్రకరణము.

## ఇంగ్లండు స్థితి.

చదువరి: మీమాటలనుబట్టిచూడగా ఇంగ్లండు పరిపాలన పద్ధతి మంచిదికాదనియు కాబట్టి అనుకరణీయము కాదనియు మీయభిప్రాయమైనట్లు తోచుచున్నది.

సంపా: మీయనుమానము సకారణమే. ఇంగ్లండుస్థితి నేడు కరుణాస్పదము. భారతభూమి కట్టిస్థితి యెన్నడురాకుం డును గాకయని నేను ప్రార్థించుచున్నాను. రాజ్యాంగసభలకు మాతృకయని మీరెంచునట్టిది గొడ్డుపోతు, అభిసారిక. ఈ రెండును కఠినోక్తులుగా దోచవచ్చును. కాని యవి మిక్కిలి యుచితములు. ఆరాజ్యాంగసభ స్వేచ్ఛగా ఇదివర కొక్కమంచి పనిచేసి యెరుగదు. కాబట్టి గొడ్డుపోతంటిని. ఆరాజ్యాంగసభ యొక్క స్వభావము చిత్రముగానేర్పడినది. బయటనుండి యొత్తిడిపెట్టక అది ఒక్కపనికూడ చేయదు. అభిసారికయని యేలయంటిననగా దానిని భరించుమంత్రులు నేడొక్కరు, రేపొక్కరు. నేడు ఆస్క్విత్తుగారు, రేపు బాల్ఫరుగారు.

చదువరి: మీరు గొడ్డుపోతని ఛలోక్తిగ చెప్పినారు. అది ఈరాజ్యాంగసభకు అన్వయింపదు. ప్రజలు ఈసభను ఎన్ను

కొనుచున్నారు. ప్రజాభిప్రాయపు ఒత్తిడి కిది లోబడుచున్నది. ఇది దీనిగుణము.

సంపా: మీరు పొరబడుచున్నారు. ఇంక కొంచెము సవిమర్శగా ఆలోచింపుడు. ప్రజలు ఉత్తములను ఏరుకొందురని యనుకొందుము. సభ్యులు ఉచితముగా పనిచేయుదురు. కాబట్టి ప్రజాహితమునకే చేయుదురని యెరుంగవలెను. నిర్వాచకులు విద్యగలవారు. కాబట్టి వారు నిర్వాచనములో సామాన్యముగా తప్పులు చేయ రనుకొనవలెను. ఇట్టి రాజ్యాంగసభకు అర్జీలు మొదలైన యొత్తిడి యవసరముండరాదు. దాని కార్యసరణి సరళముగా నడిచిపోయి తత్ఫలము దినదినము సువ్యక్తము కావలసినదే. కాని నిజమరయుదము. సాధారణముగా సభ్యులు స్వార్థపరులని కపటభావులని అంగీకృతమయియున్నది. అందులో ప్రతివాడును తన లాభాలాభములే ఆలోచించును. న్యాయముగా ప్రవర్తించుటకు ఉద్దీపకము అట్టివారికి భయము. అందుచేత నేడుచేసినది రేపు మారుచుండును. ఒక్కసంగతిలోనైనను, ఇది దీనికి కడపటి స్వరూపము అని చెప్పుటకు రాదు. అతిముఖ్యములైన విషయములు చర్చలోనున్నప్పుడు కూడ ఈరాజ్యాంగసభసభ్యులు కాళ్లుచాచుకొని నిద్రించుట సహజమైనది. ఒకొక్కప్పుడు వినువారికి వినుగుకలుగునట్లుగా సభ్యులు చేంతాడు ఉపన్యాసములు చేయుటయుకలదు. కా

లను సుప్రసిద్ధాంగ్లేయగ్రంథకారుఁడు ఈ రాజ్యాంగసభను ప్రపంచమున కంతటికిని మాటలమారిదుకాణమని వర్ణించినాడు. సభ్యులు సమ్మతి యిచ్చునప్పుడా? ఆలోచన యేమియు చేయరు. తమకక్షివా రెట్లుకోరిన నట్లేయందురు. అది కక్షిశిక్షణయట. ఏసభ్యుడైనను కాదని స్వతంత్రముగా తనసమ్మతి నిచ్చెనా అతడు తనవర్గమునకు ద్రోహచింతకుడుగా గణింపబడుచున్నాడు. రాజ్యాంగసభలో నష్టమగుకాలమును ద్రవ్యమును ఎవరోకొందరు శిష్టులచేత పెట్టినయెడల ఇంగ్లీషుజాతి యీనాటి కింకను నెంతో ఉచ్చతరస్థితియందుండి యుండును. ఈరాజ్యాంగసభ ఇంగ్లీషుజాతివారు పెట్టికొనిన దండుగవ్యయపుబొమ్మలాట. ఈయభిప్రాయములు నాయొక్కనివే యనుకోబోకుడు. గొప్పఇంగ్లీషుభావజ్ఞు లీరీతిని నుడివియున్నారు. ఆరాజ్యాంగసభలోని సభ్యుడొక్కడు క్రైస్తవుడెవ్వడును ఆసభలో సభ్యుడుకా వీలులేదని ఇటీవలనే వాకొనియున్నాడు. మరియొకడు ఈసభను వట్టిశిశువుగా వర్ణించినాడు. ఏడునూఱేండ్లిది శిశువుగానున్న, దీని కెప్పుడు యౌవనముకలుగునో యెవరు చెప్పగలరు?

చదువరి : మీరాలోచన పురికొల్పినారు. మీరు చెప్పినదంతయు వెంటనే యంగీకరింప మనరుగదా! క్రొత్తక్రొత్త భావమార్గములను మీరు సూచించుచున్నారు. నాకవి శల్యగతము

కావలసియుండును. " అభిసారిక " యనుటలో మీభావమే మో తెలుపుదురా ?

సంపా : మీరు నాయభిప్రాయములను వెంటనే యంగీక రింపకుండుట న్యాయమే. ఈవిషయమున ప్రకటితమైన వాఙ్మ యము మీరు చదివినచో దీనిసంగతి మీకు తెలియును. ఇం గ్లీషు రాజ్యాంగసభకు నాథుడు లేడు. ముఖ్యమంత్రిహయాము లో దానిబ్రతుకు తిన్నగా నడువదు. అభిసారికబ్రదుకుబోలె అటునిటు డోలాయిత మగుచుండును. ముఖ్యమంత్రికి ముఖ్యో ద్దేశము తనయధికారమే, రాజ్యాంగసభయొక్క మేలుకాదు అతని శక్తియంతయు తనకక్షవారివిజయమును సంపాదించు టకే వ్యయపడుచున్నది. కాబట్టి రాజ్యాంగసభ ధర్మ మొన ర్చుచున్నదా యనుట యతని కంతగా నవసరముండదు. కొం దరు ముఖ్యమంత్రులు తమకక్షయొక్క లాభమునుకోరి రా జ్యాంగసభచే ఎట్టికార్యమునేని చేయించిరనుటకు ఆధారము కలదు. ఇదంతయు ఆలోచనీయము.

చదువరి : ఇదివరలో మన మెవరెవరు దేశభక్తు లనుకొను చుంటిమో యెవరెవరు ధర్మపరులనుకొనుచుంటిమో వారినే మీరు తూలనాడుచున్నారు.

సంపా: అవును నిజమే. ముఖ్యమంత్రులపైనాకు ద్వేషమేమి లేదు. కాని నేనుచూచినదానినిపట్టి వారు నిజముగా దేశాభి

మానులుకారని యోచింపవలసివచ్చుచున్నది. సామాన్యముగా లంచము తీసికొననివాడు ఇయ్యనివాడు ధర్మపరు లనుకొందురేని వీరు ధర్మమార్గానువర్తు లనుకొనవచ్చును. అయినలంచములకంటె సూక్ష్మతరమగు ప్రోద్బలములు లేకపోలేదు. తమ కార్యములను సిద్ధింపచేసికొనుటకు వారితరులకు బిరుదములను లంచములిచ్చుట సామాన్యముగానున్నది. వారియందు నిజమైన ధర్మపరతకాని కళాసహితంబగు అంతరాత్మకాని లేదని నేను స్పష్టముగా చెప్పగలను.

చదువరి: మీరు రాజ్యాంగసభనుగురించి ఇట్టి భావములు చెప్పుచున్నారే. ఇంగ్లీషు ప్రజనుగురించి యేమందురు? అప్పుడు వారి ప్రభుత్వమునుగురించి ఆలోచించుకొందును.

సంపా: ఇంగ్లండులోని నిర్వాచకులకు వారివార్తాపత్రికలే వేదగ్రంథము. వారు వీని ననుసరించి తమయభిప్రాయములను తీర్చుకొనుచున్నారు. పలుమారు ఈపత్రికలు అబద్ధములు వ్రాయును. ఒకేవిషయమును ఇవెల్లయు తమతమకక్షియొక్క లాభమునకు అనుకూలించునట్లు వేరువేరురంగులతో చిత్రించును. గొప్ప యింగ్లీషునాయకుని నొకపత్రిక మహాసాధువని ఆకసమునకు పొగడును. అతనినే మరియొకపత్రిక అన్యాయముయొక్క అపరావతారముగా నిశ్చయించును. వార్తాపత్రికలీస్థితియందుండవలెనన్న ప్రజలస్థితి యెట్లుండవలెను?

చదువరి: అది మీరే వర్ణింపుఁడు.

సంపా: ఈప్రజలు అభిప్రాయములను మాటికి మాటికి మార్చుకొందురు. ఏడేండ్లకొకమారు మార్చెదరని ప్రతీతి. గడియారములోని గంటముమాదిరి వీరి యభిప్రాయములు ఎల్లప్పుడు చలించుచుండునేకాని ఒకప్పుడును నిలుకడనందవు. మంచివక్తగాని మంచి విందులిచ్చు గృహస్థుగాని దొరికినచో అతనివెంబడి వీరు పరువులెత్తుదురు. ప్రజలెట్లో పార్లమెంటు (రాజ్యాంగసభ) అట్టులే. అయిన వీరిలో ఒక్క గుణముమాత్రము బహుచక్కగా వృద్ధియయినది. తమదేశముమాత్ర మెప్పుడు పరులపాలు కానీరు. ఎవ్వరైనను దానిపై కన్నులు వేసిరా వెంటనే ఆకండ్లను పెరికి పారవైతురు. అంతమాత్రముచేత ఆజాతికి తక్కిన యన్నిసద్గుణము లున్నవనికాని వారిని మనము అనుకరింపవలెననికాని తలంపరాదు. ఇంగ్లండును భారతభూమి అనుకరించునేని నాశము తప్పదని నా యభిప్రాయము.

చదువరి: ఇంగ్లండుయొక్క ఈస్థితికి ఏమి కారణమందురు?

సంపా: ఇంగ్లీషువారిలో ప్రత్యేకలోపమేమియు లేదు. ఈ స్థితి నవీననాగరకమువలన జనించినది. దానివలన యూరపులోని జాతులు దినదినము అధోగతిపాలయి నశించుచున్నారు.

## ఆ ర వ ప్ర క ర ణ ము.

### నాగరకము.

చదువరి: అయిన నాగరకమన మీయర్థమేమో తెలుప వలసియుందురు.

సంపా: నాయర్థముకాదు. నాగరక మనుపేరిట నేదిప్రబలియున్నదో దానిని నాగరకమనరాదని యెందరో ఆంగ్లేయ గ్రంథకర్తలే వ్రాసియున్నారు. ఎన్నియో గ్రంథము లావిషయమున వెలువడియున్నవి. ఆంగ్లజాతిని నాగరకదోషమునుండి యుద్ధరించుటకు సంఘములు సభలు ఏర్పడియున్నవి. గొప్ప ఆంగ్లరచకుడొకడు "నాగరకము—దానికారణము—దానికి ప్రతీకారము" అని యొక యుద్గ్రంథము ప్రకటించినాడు. అందులో నాగరకమొకరోగమని యతడు వర్ణించినాడు.

చదువరి: మనకెందుకిది సామాన్యముగా తెలియరాలేదు?

సంపా: కారణము విదితము. ఎవ్వరును తమకు వ్యతిరేకముగా తామువిమర్శించుకొన నిచ్ఛగింపరు. నవనాగరికమును దిగ ద్రావి గట్టున త్రేపువారు దానిని దూషించుచు వ్రాయజాలరు. దానిని సమర్థించుటకు కావలసిన సంగతులు వ్యాఖ్యలు తమకు తెలియకయే వెతకికొనుచుందురు. వానిని నిజములని యాలో

పూర్వము వారు కప్పుకొనుటకు తోళ్లుపయోగించుచుండిరి. ఈ బెలనే ఆయుధములుగా వాడుచుండిరి. నేడో వారు పొడుగాటి షరాయిలుధరించి దేహము నలంకరించుకొనుటకు వివిధవస్త్రములను తొడగుచున్నారు. ఈబెలకు బదులు ఐదు ఆరుగుండ్లు పొరుబివాల్వరులను పట్టుచున్నారు. ఇదివరకు ఎక్కువగాగుడ్డలు బూట్సు మొదలైనవి వేసుకొననట్టిజాతివారు నేటిదినము యూరోపియను వస్త్రములు మున్నగునవి ధరింతురేని వారు అడవితనమునుండి నాగరకమునకు వచ్చినట్లెన్నబడుచున్నారు. పూర్వము యూరపులో ప్రజ చేతికష్టముచేసిభూములు దున్నుచుండిరి. ఇప్పుడు ఆవిరినాగేళ్లు పెట్టుకొని ఒక్కడే అనేక యకరములుదున్ని ద్రవ్యముసంపాదించి భాగ్యవంతుడగుచున్నాడు. ఇది నాగరకచిహ్నములలో నొక్కటిగా పరిగణింపబడుచున్నది. పూర్వము అతిస్వల్పసంఖ్యాకులు గ్రంథరచన చేయువారు. ఆగ్రంథములు ఉత్తమములుగా ఉండును! నేడు ఎవ్వనికి ఇష్టము వచ్చినది వాడువ్రాసి అచ్చువేసి ప్రజలమానసము మంటగలుపుచున్నాడు. పూర్వము మనుష్యులు బండికుక్కలోబడి ప్రయాణము చేతురు. ఇప్పుడు మనోవేగముతో బోవువిమానములలోనెక్కి భూమిసోకకుండ గంటకు నాలుగునూర్లమైళ్లు పరగుచున్నారు. ఇది యంతయు నాగరకశిఖరోత్తుంగముగ నాలోచింపబడుచున్నది. మానవుడభివృద్ధియైనకొలది విమానమెక్కి అతడు

ప్రపంచములోని ఏమూలకైనను గంటల ప్రయాణమున చేరవచ్చు నని చెప్పుకొనుచున్నారు. మనుష్యులకు చేతులు కాళ్లు నుపయోగించుపని యుండనేయుండదు. ఒక బొత్తాము నొత్తిన కావలసిన యుడుపులు ప్రక్కకువచ్చి పడియుండును. మరియొక బొత్తాము నొత్తిన వలయు వార్తాపత్రిక ప్రత్యక్షమగును. ఇంకొక్క బొత్తాము నొత్తిన మోటారు బండి ముంగిట నిలబడును. ఇట్లే ఆకటి వేళకు అన్నిరుచులయన్నము అట్టెయెదురగును. అన్నిపనులను యంత్రములుచేసి పెట్టును. పూర్వముయుద్ధము చేయునప్పుడు ఒండొరులు బలపరాక్రమముల ప్రకటించుకొనుచుండిరి. ఇప్పుడు ఒక్కడు మరఫిరంగివెనుక దాగినచాలును. వేనవేలను చంపవచ్చును. ఇదినాగరకము. పూర్వము మానవులు బహిరంగణమున తమశక్తికొలది పాటుపడుచుండిరి. ఇప్పుడు వేనవేలు కర్మకరులుచేరి కడుపు కక్కుఱితికై కర్మాగారములలో గనులలో పనిచేయు చున్నారు. వారిస్థితి పశువులస్థితికంటె నన్యాయము. లక్షాధికారుల మేలునకై వీరు మహాపాయకరమగు వృత్తులలో ప్రాణమునకు తెగి పరిశ్రమ చేయవలసియున్నది. పూర్వముభౌతికముగా మనుష్యుని నిర్బంధించి దాసు నొనర్చుచుండిరి. ఇప్పుడుద్రవ్యముచూపి, ద్రవ్యముచే పొందనగు మోహపాశములనుచూపి, మనుష్యుల దాసుల నొనర్చుచున్నారు. పూర్వ మెవ్వరు కలనైన కననియట్టి రోగము లిప్పుడు వేనవేలేర్పడినవి.

లక్షలకొలది వైద్యులువానికి ప్రతీకారములను వెదకుచున్నారు. అందుచేత వైద్యాలయములు పెరిగిపోయినవి. ఇది నాగరకము. పూర్వము ఉత్తరములు తీసికొనిపోవుటకు ప్రత్యేకము దూత లవసరమయి యుండినారు. ఎంతో ద్రవ్యము వ్యయముచేయ వలసి యుండినది. నేడో ఎవ్వరిని తిట్టదలచుకొనినప్పటికి కాణి కాగితముౘ్రాసి పడవేయ వచ్చును. అంతటితోనే అడకువతో కృతజ్ఞతను కూడ తెలుపవచ్చుననుటయు నిజమే. పూర్వము ఇంటిలో చేసిన బువ్వకూరలతో మూడుపూటల భోజనముండి నది. ఇప్పుడో గంట గంటకు ఏదో తిండి కాఫీహోటలులో తినవలెను. దీనికే సగ మాయువు పట్టుచున్నది. వేరుపనికి వేళ యేలేదు. ఇంకను నేను చెప్పవలసిన దేమికలదు? ఇదంతయు ఉత్తమ రచకులే వర్ణించినారు. ఇవియన్నియునాగరకమునకు చిహ్నములే. ఎవరైనను కాదందురా! వారుశుద్ధమూర్ఖులని తెలియ వలసినదే. ఈ నాగరకములో నీతిమతములకు తావులేదు. తద్భక్తులు మతమునేర్పుట మాపని గాదని ఘంటాపథముగ చెప్పెదరు. అందులో కొందరు మతముమూఢవిశ్వాస మనియు నం దురు. మరి ఇతరులో, వేషము వేసికొని శ్రీరంగనీతులు బోధిం తురు. అయిన ఇరువదియేండ్ల అనుభవము మీద నాకొక్క నమ్మిక మేర్పడినది. నీతియని నేర్పునది యెక్కువగా అవినీతి యే. నేను పైన వర్ణించిన జీవితక్రమములో ఎక్కడను నీతికి

ఉద్దీపకము లేదనుట శిశువునకుగూడ అర్థము కాకపోదు. నాగరకము భౌతికసౌఖ్యములను పెంచుటకు ప్రయత్నించుచున్నది. ఆ ప్రయత్నమునందును అది యేమాత్రము ఫలసిద్ధి పొందుట లేదు.

ఈనాగరకము దుర్మతము. దీనిప్రభావము వర్ణనాతీతము. యూరపులో దీనికి లోబడినవారనేకులు వెఱ్ఱివారికి తుల్యులుగా నున్నారు. వారికి బుజబలముకాని సహజధైర్యముకాని లేదు. త్రాగుడువలన వారిశక్తిని నిలువబెట్టుకొనుచున్నారు. ఒంటరిగానుందురేని వారికి జీవనమే దుర్భరమగును. గృహాధిదేవతలుగా నుండదగిన స్త్రీలు వీధులలో నల్లాడుచుందురు. లేదా, కర్మాగారములలో క్రుగ్గుచుందురు. గంజికిగాను ఇంగ్లండులో ఐదులక్షల స్త్రీలు కర్మాగారములలోను మరియితరసంస్థలలోను మహానర్థపరిస్థితులలో నుండుచు పనిచేయుచున్నారు. స్త్రీస్వాతంత్ర్యవాదము దినదినము బలపడుట కీగొప్పదురావస్థ యొక్క కారణము.

ఈనాగరకము దానంతటతానె నశింపగలదు. మనము ఓపిక మాత్రము పట్టియుండవలెను. మహమ్మదుబోధ ననుసరించిన యెడల ఈనాగరకమును సైతానునాగరకమనవలెను. హిందూమతము దీనిని కలియుగమనుచున్నది. దీని పూర్ణరూపమిట్టిదని మీా కెఱిఁగింపలేను ఇంగ్లీషుజాతి నిదిపట్టి వారి కంఠ

శ్రావ్యనంతయు కాజేయుచున్నది. దీనిని త్యజించికావలెను. రాజ్యాంగసభలు నిజముగా దాసత్వచిహ్నములు. మీరు చక్కఁగా విషయము లాలోచించితిరేని ఈసంగతి మీకు స్పష్టపడి ఆంగ్లేయులను మీరు దూరుట మానివేయుదురు. వారిని మనము నిజముగా కరుణింపవలెను. వారిజాతి యుక్తికలజాతి. తప్పక వారికీడును తొలగించుకొందురని నానమ్మకము. వారు పాటుపడువారు, సాహసులు. వారిభావమార్గము నీతిసహజముగా అవి గలదికాదు. వారిహృదయంబును దోషాకరము కాదు. కాబట్టి నేను వారిని గౌరవించుచున్నాను. నాగరకము ఔషధము లేనిరోగముకాదు. కాని ఇంగ్లీషువారుమాత్రము దానివలన బాధపడుచున్నారనుట మరువరాదు.

## ఏడవ ప్రకరణము.

### భారతభూమి ఏల నష్టమైనది ?

చదువరి: నాగరకమునుగురించి మీరు పుష్కలముగా వివరించినారు. నేను విమర్శించుకొనుటకు చాలినంత చెప్పినారు. యూరపుజాతులనుండి మనమేమిగ్రహింపవలెనో యేమిత్యజింపవలెనో నేను నిశ్చయముగా తెలిసికొనలేకున్నాను. ఒక్క ప్రశ్నమాత్రము నాపెదవుల నానియున్నది. నాగరికమే రోగమైన, ఇంగ్లండు ఆరోగమునకు లోబడియున్న, భారతభూమి ఇంగ్లండువశ మెట్లైయున్నది. ఇంకను నావశమున నెట్లు నిలచినది?

సంపా: మీప్రశ్నకు ఉత్తరముచెప్పుట మిక్కిలికష్టము కాదు. త్వరలోనే నిజమైన స్వరాజ్యతత్త్వముకూడ విమర్శింపనగును. ఇది యేల మధ్యమున చొప్పించితిరందురా నే నింకను ఆప్రశ్నకు జవాబియ్యవలసియున్నందున నేయగును. ముందు మీ వెనుకటిప్రశ్నకు ప్రత్యుత్తరమిచ్చెద. ఇంగ్లీషువారు భారతభూమిని తీసికొనలేదు; మనము వారికిచ్చినాము. వారికి బలము ఉండబట్టి వారిక్కడలేరు. వారిని మనము నిల్పియున్నాము. కాబట్టి వారిక్కడనున్నారు. ఈవిషయములు

నిజమేమో విచారింతము. మొదట వారు మనదేశమునకు వచ్చినది వ్యాపారముచేసికొనుటకు. తరువాత కంపెనీ బహదూరేర్పడెను. కంపెనిని బహదూరుచేసినవా రెవరు.? వారు వచ్చినప్పుడు రాజ్యము స్థాపింపవలెనని వారికి కొంచమైనను ఆశ లేనే లేదు. కంపెనీవారి యధికారులకు సాయముచేసిన దెవరు? వారు తెచ్చిన అద్దాలసొబగుచూచి మోహించినదెవరు? వారివస్తువులను కొనినదెవరు? చరిత్రచూచినయెడల ఇవన్నియు మనమేచేసినట్లేర్పడుచున్నది. ఒక్కనాటిలో శ్రీమంతులము కావలెనని కుంఫిణీవారియధికారులకు ముకుళితకరకమలములతో స్వాగతమిచ్చితిమి. వారికి సహాయముచేసితిమి. భంగీ త్రాగునలవాటు నాకు ఉన్నదనుకొందము దాని నమ్మువాడు నాకమ్ముచున్నాడు. దోషము అతనిదో? నాదో? అతనిని దూరినమాత్రాన నాయభ్యాసము వదలగలనా? ఈవ్యాపారిని తరుముగొట్టినట్లైన ఇతనిస్థానమున ఇంకొకవ్యాపారి రావలసినదే గదా! భారతభూమికి నిజసేవకుడైనవాడు బునాదులతో విషయము పరిశీలింపవలెను. అపరిమితముగా అన్నముదిని యజీర్తిచేసికొని నీటిపైబడి నెత్తిమోదికొనిన నేమిలాభము? మూలకారణము కనిపెట్టినవాడే ముస్తాబువైద్యుడు. భారత భూమి నుద్ధరించు ముస్తాబువైద్యుడను నేను అనువాడు మూలకారణమరయక తప్పదు.

చదువరి: మీరు చెప్పినది సరే. ఇకముందు మీసిద్ధాంతములు నాకు నచ్చజెప్పుటకు ఎక్కువవాద మవసరముండదు. మీయభిప్రాయము లెక్కువగా వినవలెనని కుతూహలము కలుగుచున్నది. ప్రస్తుతమాలోచించుచుండువిషయము మిక్కిలి చిత్తాకర్షకము. మీరు చెప్పునదంతయు సావధానముగా విందును. అనుమానమంకురించినచోటమాత్రము ప్రశ్నింతును.

సంపా: మీరు ఉత్సాహము పలుకుటదప్ప మున్ముందు ఎక్కువ భేదాభిప్రాయములు కలుగునని నాకుదోచుచున్నది. మీరు ప్రశ్నించునప్పుడు నావాదము చెప్పుకొందునుగాక. మనము ప్రోత్సాహపరచినందువలననే బ్రిటిషువర్తకులు భారతభూమిలో కాలూనగలిగిరని ఇదివరలో చెప్పితిని. మనరాజులు వారిలోవారు పోట్లాడికొనినప్పుడు తమతమబలమును వృద్ధిచేసికొనుటకు వారువారు కుంఫుణీబహదూరుసహాయము కోరిరి. ఆకుంపిణీ వ్యాపారమునందును యుద్ధమునందును సమర్థమయియుండినది. ధర్మసందేహములు దానికి కలిగినవిగావు. తన వ్యాపార మభివృద్ధిచేసికొనుట, ద్రవ్యముగడించుట, ఇవి రెండే దాని యాలోచనలు. కాబట్టి అదిమనసహాయమును అంగీకరించి తనకుచెందిన వ్యాపారస్థానముల నెక్కువచేసికొనెను. ఈవ్యాపారస్థానములసంరక్షణార్థమై కుంపిణీవారు సైన్యమును పెట్టుకొనిరి. ఆసైన్యమును మనముకూడ వినియోగపరచు

కొంటిమి. అప్పుడు మనముచేసినపనికి ఇంగ్లీషువారిని దూషిం చుట వ్యర్థముకాదా? హిందువులు మహమ్మదీయులు ఒకరి మీదనొకరు కత్తిదూసి యుండిరి. ఇదియు కుంపిణీవారికి అనుకూలమయ్యెను. ఈరీతిగా కుంపిణీకి భారతభూమిలో అధికారము దొరకు లసందర్భములను మనమేర్పరచితిమి. అందువలన భారతభూమి నష్టమైనదనుటకంటె మనము భారతభూమిని ఇంగ్లీషువారికి ఇచ్చినామనుట సమంజసము.

చదువరి: వారు భారతభూమిని నిలుపుకొనగలిగిన ట్లో చెప్పగలరా?

సంపా: ఏకారణములు వారికి భారతభూమిని దానము చేసెనో ఆకారణములే వారు దానిని నిలుపుకొనుటకును తోడ్పడుచున్నవి. కొందరు ఇంగ్లీషువారు కత్తిబట్టి భారతభూమిని జయించినట్లును ఆకత్తిబలముచేతనే ఇప్పుడు నిలుపుకొనుచున్నట్లును చెప్పుదురు. ఈరెండుమాటలును తప్పే. భారతభూమినినిలుపుకొనుటకు కత్తిఏమాత్రమును పనికిరాదు. మనమే ఇంగ్లీషువారిని నిలుపువారము. ఇంగ్లీషువారు దుకాణదారుల జాతియని నెపోలియను వర్ణించినాడట. అది ఉచితవర్ణనయే. వారికిగల సామ్రాజ్యమంతయు వారు వ్యాపారముకొరకే నిలుపుకొనుచున్నారు. వారినౌకాసైన్యము భూసైన్యము అంతయు ఆవ్యాపారమును రక్షించుట కేర్పడినవియే. ట్రాన్సువాలులో

వ్యాపారపాశము పనికిరానందున కీర్తిశేషుడు గ్లాడుస్టను ఇంగ్లీషువా రాప్రాంతమును తమవశమున నుంచుకొనుట సరికాదని నిశ్చయించెను. అయిన అదేప్రాంతము లాభకారి యయినప్పుడు సంఘర్షణకలిగి యుద్ధము పొసగెను. వెంటనే ట్రాన్సువాలుపై ఇంగ్లండుకు సార్వభౌమత్వాధికారము కలదని ఛేంబర్లేనుగారు కనిపెట్టిరి. ఒక చిన్నకథ చెప్పుదురు. అధ్యక్షుడు క్రూజరు బ్రతికియుండగా నెవరో అతనిని 'చంద్రునిలో బంగారమున్నదా' యని అడిగిరట. 'చాలమట్టుకు లేదు. ఉన్నయెడల ఇంగ్లీషువారెన్నడో దానిని స్వాధీనపరచుకొనియుందురు' అని అతడు బదులుచెప్పెనట! వారికి ధనము దైవమనుట జ్ఞాపకముంచుకొనునెడల ఎన్నిచిక్కులనో అర్థముచేసికొనవచ్చును. అంతయు చూడగా ఇంగ్లీషువారిని మన స్వోపయోగార్థము మనమిక్కడ ఉంచుకొనుచున్నామనుట తేలుచున్నది. వారివ్యాపారము మనకు కావలెను. వారి చాకచక్యపద్ధతులచేత వారు మనలను తృప్తిపరచుచున్నారు. వారికి కావలసినది అందుమూలకముగా సంపాదించుకొనుచున్నారు. వారిని ఇందుకుగాను దూషించుట వారిశక్తిని ఇనుమడింపజేయుటతప్పు వేరుకాదు. మనలో మనము పోట్లాడుకొని వారిశక్తిని బలవత్తరముచేయుచున్నాము. పైచెప్పినసంగతులన్నియు అంగీకరించునెడల ఇంగ్లీషువారు వ్యాపారమునకై యిక్క

కీకివచ్చినారనుట సిద్ధము. అదేపనికే వారు నిలిచియున్నారు. అందులో మనము వారికి సహాయము చేయుచున్నాము. వారి మందుగుండ్లు నిజముగా ఏమి పనికిరావు. ఈసందర్భములో మీకు నేనింకొక్కటిచెప్పవలెను. జపానులో జపానీయులజండా యెగురుటలేదు. ఇంగ్లీషువారిజండాయే యెగురుచున్నది. జపానులో వ్యాపారముకొరకు ఇంగ్లీషు వారు సంధిచేసికొనియున్నారు. సాధ్యమయినయెడల వారివ్యాపారము జపానులోకూడ వ్యాపింపగలదు. వారులోకమునంతటిని తమవస్తువుల విక్రయమునకుగాను గొప్పవిక్రయాంగణముగా నేర్పరుచుకొననున్నారు. వారి కిది సాధ్యముకాదనుట నిజమే. కానిలోపము వారిది కాబోదు. వారు తమయుద్దేశము నెర వేర్చుకొనుటకు సర్వప్రయత్నములుచేసి వదలుదురు.

## ఎనిమిదవ ప్రకరణము.

### భారతభూమిస్థితి.

చదువరి : ఆంగ్లేయు లేల హైందవభూమిలో నిలచియున్నా రో యిప్పుడు నాకర్థమయినది. మన దేశస్థితినిగురించి మీ యభిప్రాయములేమియో నేను వినవలతును.

నంపా : ఆస్థితి మిగుల విచారకరమైనది. దానినిగురించి ఆలోచించిననే నాకంట నీరునిండుచున్నది. గొంతు ఎండబారి పోవుచున్నది. నిజముగా నాహృదయమున కలరూపు కలయ ట్టులు వివరింపగలనా యనుసందేహము పుట్టుచున్నది. ఇంగ్లీషు వారి కాలిక్రింద కాదు మనముపడిమడయుచుండుట. నవనా గరికముయొక్క త్రొక్కుడున మనము నశించుచున్నామనుట నాపూర్ణవిశ్వాసము. ఆరాక్షసుని భరింపలేక దేశమాత సంకటపడిమూల్గుచున్నది. తప్పించుకొనుట కింకను అవకాశ మున్నది. కాని దినములు గడచినకొల్ల నాయానకాశము తగ్గిపో వుచున్నది. మతమునందు నాకభిమానము. నాకు మొదట కాన్పించుగొప్పలోపము భారతభూమి దుర్మతముపాలగుచుండు టయే. నేనుహిందూ, మహమ్మదీయ, పారసి మతములను గురించి యాలోచించుచున్నా ననుకొనవలదు. అన్నిమతము లకు మూలాధారమైన ఆధ్యాత్మికమతము సంగతియే నాయా లోచన. మనము దైవమునే దూరముచేసికొనుచున్నాము

చదువరి: అదియెట్లు?

సంపా: మనముసోమరిపోతుల మని యురోపియనులు కష్టించువారని సాహసులని ఒక్క ప్రతీతి యేర్పడినది. ఆప్రతీతిని మన మంగీకరించి మనస్థితిని మార్చుకొననిచ్ఛగించుచున్నాము. హిందూ మహమ్మదీయపారసీక్రైస్తవమతములు బోధచేయున దేమన, భౌతిక సౌఖ్యముల యెడల లోలత్వమువలదు. ఆధ్యాత్మిక లోకమునకై సతతపరిశ్రమచేయువలసినది. లోకములో విషయ సంగ్రహమొనర్చుదు ననునాశను త్రుంచవలసినది. ముక్తిమార్గమును తదేకదీక్షతో నరయవలసినది. మనసర్వప్రయత్నముదీనికి వినియోగించవలసినది.

చదువరి: మీరేమి! మతముపిచ్చి పట్టించుప్రయత్నము చేయునట్లున్నారు. ఎందరోదొంగలు ఇదేరీతిని బోధించి లోకులను పెడమార్గముల బట్టించినారు.

సంపా: మతమునుగురించిమీరక్రమదూషణచేయుచున్నారు' సుమా! దొంగతనము మతముపేరిట జరుగకపోలేదు. వెలుతురెక్కడకలదో చీకటియు నుండకపోదు. ఆధిభౌతిక విషయములలోని దొంగలకంటె ఆధ్యాత్మికవిషయములలోని దొంగలు ఎక్కువ దుర్మార్గులు కారని నేను ఋజువు చేయగలను. నాగరకముపేరట జరుగునట్టి దుర్మార్గము మతముపేరట నెప్పుడును జరుగదనుట ఇదె మీరు కనగలరు.

చనువరి: అదెట్లనగలరు? మతము పేరు పెట్టుకొనియే హిందువులు మహమ్మదీయులు యుద్ధములాడుకొనినారు. మతము పేరు పెట్టుకొనియే క్రైస్తవులలో క్రైస్తవులు ఒకరినొకరు సంహారము చేసికొనినారు. వేలకొలది నిరపరాధులు మతము పేరటనే కత్తివాతికి అగ్నిజ్వాలలకు చెప్పరానిహింసలకు పాలయినారు. ఏనాగరకముకంటెనుకూడ ఇది అసహ్యాకరముకాదా.

సంపా: నాగరకము యొక్క కష్టములకంటె పైకష్టములు భరించుట సులభతరమని నాహృదయపూర్వకవిజ్ఞాపనము. మతము పేరుపెట్టిక్రౌర్యములు జరిపియుండుట నిజమేయైనను ఎవ్వరును ఈక్రౌర్యములు మతమున కంగములని యెప్పుడును చెప్పియుండలేదు. కాబట్టి ఈక్రౌర్యములు మనతో సంపూర్తియగుచున్న వేకాని వెనుకటికి బీజములను చల్లిపోవుటలేదు. మూఢవిశ్వాసులును నజ్ఞానులునైన ప్రజలున్నంతకాలము ఇట్టిక్రౌర్యములు జరుగవచ్చును కాని నాగరకజ్వాలలక్రింద లీనమగునట్టి దురదృష్టులసంఖ్యకు మితియనుమాటయే లేదు. నాగరకమున నుండునట్టి పరమనీచగుణ మేమందురా? మానవులు దానినే మోమహాప్రసాదమనుకొని ఆకాంక్షించ్చు నురుకుచుందురయే. అందుపడినవారు దుర్మతముపాలయి లోకఫలమేమాత్రమును అనుభవింపజాలనివారగుచున్నారు. నాగరకము తేనెపూసినకత్తివంటిది. దానిపూర్ణఫలముబయల్పడినప్పుడు నవ

నాగరకమునకంటె మూఢభక్తితోఁ గూడిన మతవిశ్వాసమే వేయిమడుంగులు శ్రేయస్కరమని మనకు నర్థముకాఁగలదు. ఇట్లనుటచేత నేను మూఢవిశ్వాసముల విజృంభణమునకు తోడ్పడుచున్నానని యనుకొనవలదు. వానిని మనము సర్వవిధముల నెదిర్చి తుదముట్టింపవలసినదే. మతమునే ఉల్లంఘించి ఆపని చేయఁగలుగుదురనుట కల్ల. మతములోని సారమును గ్రహించి దానిని నిలిపిననే తక్కుంగల కార్యము సాధ్యమగును.

చదువరి. అయిన బ్రిటిషుశాంతి నిరుపయోగకరమనియా తమ యభిప్రాయము.

సంపా: శాంతి మీకు కానవచ్చుచున్నదేమో, నాకుమాత్రము కానరాలేదు.

చదువరి: ఠగ్గులు, పిండారీలు, భీలులు దేశమునకు కలిగించుచుండినయుపద్రవము మీకు లక్ష్యములో నున్నట్లు లేదు.

సంపా: కొంచెము మీరాలోచించునెడల ఆభయమంతయు నెంతో యెక్కువలోనిది కాదని మీ రెరుంగగలరు. నిజముగా ఆఅల్లరులంత గొప్పవేయైనచో బ్రిటిషువారు రాకముందే ప్రజలందరు నశించియుందురు. అంతేకాక ప్రస్తుతమున్నదు శాంతి నామకార్థమే. దీనివలన మనము ధైర్యస్థైర్యవిహీనులమై నాము. వ్యర్థులమైనాము. బ్రిటిషువారు పిండారీల భీలుల స్వభావమును మార్చినారనుకొనుటకు రాదు. పిండారీల భయము

నుండి మనల సంరక్షించి మగతనము లేనివారినిగ చేసిన ఈపరి స్థితులకంటె పిండారీలతో పోరాడుచుండుటయే మెరుగుగా నుండియుండును. పౌరుషవిహీనమగు సంరక్షణకంటె భీలుని బాణముచేతను చచ్చుటయే నామట్టుకు నాకు అనుకరణీయము. అట్టిసంరక్షణ లేనికాలమున భారతభూమి శౌర్యసంపన్నమయి యుండినది. హైందవులు పిరికివారని వ్రాసిన మెకాలే అజ్ఞానమును ప్రకటించెనుకాని మరియొకటి కాదు. అట్టిదూషణకు హైందువులు పాత్రులు కారు. మొరటుఅడవిజాతులును వ్యాఘ్రములు తోడేళ్లును నిండినయరణ్యములను కలభూమిలోని మానవులు పిరికివారైనచో ఎన్నడో కలికమున కైన కాన రాక పోవుదురు. మీ రెప్పుడైనను చేలదగ్గరకు పోయినారా? నేడు కూడ మన రైతులు హాయిగా చేలలో నిర్భయముగా పండు కొందురు. ఇంగ్లీషువారు, మీరు, నేనే మైన వారు నిద్రించు చోట నిద్రింపజాలము. శక్తి భయము లేమిననుకరించును. దేహములోనుండు మాంసము రక్తముల ననుకరింపదు. స్వరాజ్యము కోరునట్టి మీకందరకును నెనొక్క విషయము స్మరింపజేయ వలసియున్నాను. ఈ భీలులు, ఈపిండారీలు, ఈథగ్గులు, ఈఅసామీలు, అందరు నాదేశస్థులే వారిని జయించుట మీపని నాపని. మనసోదరులకే మనము భయపడుచుండునెడల మన యాదర్శము చేరుట మనకు దుర్లభమే కాదు.

# తొమ్మిదవ ప్రకరణము.

## భారతభూమిస్థితి, రైల్లు.

చదువరి: భారతభూమిలో శాంతికలదను భావము పెట్టుకొని నేనందుచుండినసంతుష్టిని మీరు పోనాడితిరి.

సంపా: మతవిషయమునమాత్రము నే నిదివరకు మీకు నాయభిప్రాయమును తెలిపినాను. భారతభూమి దారిద్ర్యమును గురించి నాభావములను తమకు తెల్పుచో తమరు నాయెడ సనిష్టముకలవారుకూడ కావచ్చును. ఏలయన, మీరు నేను ఇదివరలో ఏది భారతభూమికి ఉపయోగకరమని యెంచియుంటిమో అదినాకు ఇప్పుడు ఏమాత్రము పనికివచ్చునదిగా తోచదు.

చదువరి: అది యేమది?

సంపా: రైల్లు, వకీళ్లు, వైద్యులు దేశమును పేదచేసినారు. త్వరగా మేల్కొననియెడల మనకు నాశము సిద్ధము.

చదువరి: మనము ఏకీభవింపచాలకపోవచ్చుననుట నాకిప్పుడు స్పష్టమగుచున్నది. ఏసంస్థలు మంచివని ఇంతకాల మనుకొనినామో వానినే మీరిప్పుడు ఖండింపనున్నారు.

సంపా: దయచేసి ఓపికపట్టవలయును. నాగరకమునసంతర్గర్భితమైయుండు కీడులను నిదానముమీదగాని మీరు గ్రహిం

పజాలరు. డాక్టరుల నడగినయెడల క్షయరోగి కొకగుణము సహజమని చెప్పుదురు. చచ్చునప్పుడుకూడ అతడింకను బ్రతికి యున్నట్లే భావించుచుండునట! క్షయ బయట స్ఫుటముగా కాన్పించురోగము కాదు. రోగిముఖమునకు దివ్యమగు కాంతి నిచ్చి ఆరోగ్య మనంతమను మోహమున పడవేయును. నాగరకము ఇట్టిరోగమే. మనము బహుజాగ్రత్తగా నుండవలెను.

చదువరి: మంచిది. రైళ్లనుగురించి సెలవిండు.

సంపా: రైళ్లే లేకపోయినచో భారతభూమిని ఇంగ్లీషువారు ఇంతపూర్ణముగా వశమున నుంచుకొనలేరనుట మీకు విదితమేగదా! రైళ్లవల్లనేకదా బొబ్బులమారి వ్యాపించినది! రైళ్లు లేనియెడల ప్రజ గుంపుగుంపులుగా ప్రయాణములు చేయుటకు వీలులేదు. మహామారి పురుగులను అవి మోసుకొని వచ్చుచున్నవి. పూర్వము సహజముగానే ప్రత్యేకత్వముండినది. రాకపోకలు సులువైనందున ఎక్కడప్రియముగా అమ్మునవిన అక్కడికి రైతులు ధాన్యము ఎగుమతిచేసివేయుదురు. అందుచేత క్షామములు నిరంతరమయినవి. ఇది రైళ్లవలన కలిగిన స్థితియే. ప్రజలు అజాగరూకులయి క్షామభాధహెచ్చైనది. రైళ్లు మానవుని దుస్స్వభావమును పెంచినవి.దుష్టులైనవారు శీఘ్రతరముగ తమయుద్దేశములను నెరవేర్చుకొనుటకు అవకాశము కలిగినది. భారతభూమిలోని పవిత్రక్షేత్రములు అపవిత్రములయి

నవి. పూర్వపు ఈస్థలములకు ప్రజలు మిక్కిలి కష్టపడిపోవు చుండువారు. కాబట్టినిజముగా భక్తికలవారే సాధారణముగా పోవుచుందురు. నేడో యెందరో దురాత్ములు తమ దుర్మార్గమును సాగించుకొనుటకు అక్కడకు పోయి చేరుచున్నారు.

చదువరి: మీరుమాటలాడునది పక్షపాతముగా నున్నది. క్షేత్రములకు దుర్మార్గులుపోవచ్చును. మంచివారును పోవచ్చును. రైళ్ళనేల వీరు వినియోగించుకొనరాదు?

సంపా: మంచితనము నత్తవలె నిదానముగా ప్రయాణము చేయును. కాబట్టి దానికి రైళ్లతో నెక్కువసంబంధ మక్కర లేదు. మంచిచేయదలచువారికి స్వార్థపరత లేదు. వారుతొందర పడ నవసరములేదు. ప్రజలకు మంచితనముపట్టించుటకు దీర్ఘ కాలము కావలయునని వారెరుగుదురు. చెడుగునకు రెక్కలు కలవు. ఇల్లు కట్టుట కెంతో కావలెను. పడగొట్టుట పరమసులభము. ఈకారణములచేత రైళ్లు చెడుగును వ్యాపింపజేయుటకు సాధనములగుట సంభావ్యము. రైళ్లు క్షామమును వ్యాపింప జేయునా అనుప్రశ్న విమర్శనీయము కావచ్చునుగాని అవి చెడుగును వ్యాపింపజేయు సాధనమనుటకు మాత్రము సందేహము లేదు.

చదువరి: అది యెట్లునను కాని భారతభూమిలో జాతీయత

యనునవీన తేజమును రైళ్లేకదా వ్యాపింపఁ జేసినవి. అదొక్క మేలు చాలదా అన్ని నష్టములను కప్పుటకు.

సంపా: ఇది తప్పని నాయభిప్రాయము. మనము ఇంతకుముందొక జాతిగా నుండ లేదని, మన మొక్కజాతి యగుటకు యుగములు పట్టునని ఇంగ్లీషువారు మనకు నేర్పినారు. దీనికేమియు ఆధారము లేదు. ఇంగ్లీషువారు భారతభూమికిరాకముందు మనమొక్క జాతిగానే ఉండినాము. మనభావప్రపంచమంతయు నొకటే. మనజీవితమార్గమంతయు నేకమే. మనమందరు ఒక్కజాతిగా నుండినందుననే వారు రాజ్యమును నిర్మింపగలిగిరి. తరువాతనే వారు మనలను విభాగించినది.

చదువరి: ఇది వివరించి చెప్పవలెను.

సంపా: మనము ఒకజాతిగా నున్నందువలన మనలో విభేదములే ఉండలేదని నేను చెప్పరాలేదు. చెప్పదలఁచిన దిది. మననాయకులు భారతభూమియంతటను బండ్లమీదనో నడచియో సంచారము చేయుచుండువారు. ఒండొరులభాష నేర్చుకొనువారు. ప్రత్యేకత్వము పాటించువారుగారు. దక్షిణమున సేతుబంధరామేశ్వరము ఈశాన్యమున జగన్నాథము ఉత్తరమున హరిద్వారము పుణ్యక్షేత్రములుగా నియమించిన మనపూర్వీకులయుద్దేశ మేమయియుండునో చెప్పగలరా? వారు వెఱ్ఱివారు కారుకదా! క్షేత్రములలోవలె దేవతారాధన ఇంటిలోనే

చేసుకొనవచ్చునని వారెఱుగుదురు. భక్తిప్రపూర్ణములైన హృదయములే గంగాప్రవాహములని వారు మన కుబోధచేయ నేచేసిరి. కాని వారు భారతభూమి దైవనిర్మితమైన ఏకప్రదేశ మనుటను గురుతించిరి. అందుచేత అది ఏకజాతిగా నుండవలసిన దని తీర్మానించిరి. తదనుగుణముగా భారతభూమి పదిచెరగులను పవిత్రక్షేత్రములను స్థాపించి మఱిభూలోకమున నెచ్చటను ప్రయత్నింపని భావోద్రేక పద్ధతిని అనుసరించి భారతజాతీయతను స్థిరపరచిరి. ఇప్పు డాంగ్లేయులు తామొక్కటియనుకొనుటకంటె ఇప్పుడు భారతపుత్రులు తామొక్కటియనుకొనుటలో గాఢతరసంవేదనకలదు. మీరు, నేను—నాగరికులమనుకొనుమనము—ఏదో ఆకసమునుండి ఊట్టిపడిన గౌరవ పదస్థులమనుకొనుమనము—వేరువేరుజాతులకుచేరినవారమనుకొనుచున్నాము. రైళ్లువచ్చిన తరువాతనేమనము విభేదములమాట మాట్లాడుకొన నారంభించినది. రైళ్లమూలకముగానే ఈవిభేదములను పోగొట్టుచున్నా మందురేని మీరట్లే యనుకొనవచ్చును. నల్లమందు తినువాడు నల్లమందు తినుటకు నేర్చిన పిదపతనకుచెరుపు తెలిసినదికాబట్టి తానునల్లమందు అభ్యాసము చేయుట మంచిదేయనుకొని నట్లుండును. నేను రైళ్లనుగురించి చెప్పినదంతయుమీరు జాగరూకులై ఆలోచింతురుగాక.

చదువరి: సంతసముతో నాలోచింతును. కాని నాకొకప్రశ్న పొడకట్టుచున్నది. మీరు చెప్పినదంతయు మహమ్మదీయు

లకు పూర్వమునాటి భారతభూమికి అన్వయించుచున్నది. ఇప్ప టి మన భారతభూమిలోమహమ్మదీయులు, పారసీలు, క్రైస్త వులు అందరున్నారు. వీరంద రొకజాతి యెట్లగుదురు? హిందు వులు మహమ్మదీయులుప్రాతవైరులు. మన లోకోక్తు లేఅందుకు నిదర్శనములు. హిందువులుతూర్పుకుతిరిగిన మహమ్మదీయులు పడమటికి తిరుగుదురు. వారిని వీరు విగ్రహారాధకులని నిరసింతురు. హిందువులు గోవును పూజింతురు. మహమ్మదీయులు సంహరింతురు. హిందువులు అహింసతత్త్వము నంగీకరింతురు. మహమ్మదీయులంగీకరింపరు. ఈరీతిగా ప్రతివిషయములో భేదములు కలవు. భారతభూమి ఒకజాతి యెట్లు కాగలదు?

## పదియవ ప్రకరణము.

---

### భారతభూమిస్థితి.

### హిందువులు—మహమ్మదీయులు.

సంపా: మీరు కడపట నడిగినప్రశ్న చిక్కుది. కాని ప్రత్యుత్తర మెంతో కష్టముకాదు. రైళ్లు, వకీళ్లు, వైద్యులు ఉండుట చేత ఈప్రశ్న కవకాశము కలిగినది. రైళ్లనుగురించి ఆలోచించినాము, మరి ఇప్పుడు వకీళ్లు, వైద్యులనుగురించి అలోచింతము. స్వభావముచేత మనము కాళ్లుచేతు లెంతదూరము తీసికొనుపోవునో అంతమాత్రమునకే అర్హులము. రైళ్లుమొదలైన మోహాకరసాధనములమూలకముగా తావునుండి తావునకు పిచ్చివేగమున పరుగిడకుండుమేని అనవసరగందరగోళము లుండియుండవు. మనకష్టములు మననిర్మితములే. మానవశరీరము నేర్పరచినప్పుడే యీశ్వరుడే శరీర సంచలనమునకు నొకమితి యేర్పరచెను. వెన్వెంటనే మానవుడు ఆ మితిని మీరుటకు సాధనములు వెదక మొదలిడెను. మానవుడు తనసృష్టికర్త నెరుంగునుగాక యని అతనికి బుద్ధిబలము కలిగెను. మానవుడుదానిని దుర్వినియోగముచేసితనసృష్టికర్తనే మరచెను. నేనునాచుట్టుముట్టునుండువారలకు తోడగునట్లు

మాత్రమే దైవమునన్ను నియమించినాడు. కాని గర్వముచేత నేను ప్రపంచములోని ప్రతిమానవునకు తోడగుదునని నటించుచున్నాను. ఈరీతిని అసాధ్యములను సాధ్యముచేయ నాలోచించుటలో మానవుడు అనేక భిన్నస్వభావములను భిన్నముఖములను ఎదుర్కొనవలసిన వాడగుచున్నాడు. అందువలన ఎక్కడలేని గందరగోళమున పడిపోవుచున్నాడు. ఈ హేతువాదమును సంగీకరించునెడల రైళ్లు మహానర్థదాయకములనుట మీకర్థముకాగలదు. అవి కారణముగా మానవుడు సృష్టికర్తనుండి యెంతో వేరుపడిపోయినాడు.

చదువరి: కానిండు. నాప్రశ్నకు నుత్తరమునకై మిక్కిలి యాతురతతో నెదురుచూచుచున్నాను. మహమ్మదీయులరాకతో మన జాతీయత పోలేదా?

సంపా: వివిధమతములవారు నివసించినమాత్రమున భారతభూమి యొక్కజాతి కాకపోలేదు. విదేశీయులు వచ్చినతోడనే దేశజాతి నశించిపోదు. వారు దీనియందు లీనమైపోదురు. ఇది జరిగినప్పుడు దేశ మొక్కజాతియేకాని వేరుకాదు. దేశమునకు ఇతరులను తనలో లీనముచేసికొను శక్తిమాత్రముండవలెను. భారతభూమికి ఎల్లప్పుడును ఆశక్తికలదు. నిజమరయగా తలకొక్కమతమనుటతప్పదు. కాబట్టి జాతితత్త్వము నెరిగినవారెవ్వరును మతభేదములను గణింపరు. అట్లుగణింతురేని వారుజాతి

కాజాలరు. హిందువులు భారతభూమిని తామేనివసింపనెంతు రేని మిథ్యలో పడినవారగుదురు. భారతభూమిని మాతృ భూమిగా గొనియుండు హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, పారసీలందరును ఏకదేశీయులు. తమతమ స్వలాభమునకే యైనను వీర లొండొరులతో నైకమత్యముగా నివసింపవలసి యుందురు.లోకములో ఎచ్చటను జాతీయతయనిన ఏకమతా వలంబనమను నర్థములేదు. భారతభూమిలోను ఆసిద్ధాంతము నడచినదికాదు.

చదువరి:అయిన హిందూమహమ్మదీయులకు గల సహజ వైరమునుగురించి మీ రేమందురు?

సంపా:మనయిరువురకు శత్రువులైనవారీపదములనుకల్పించినారు. హిందువులు మహమ్మదీయులు పోరాడికొనినప్పుడు అట్లువర్తించిరి సరిగదా బహుకాలముగా పోరాటములు లేవే ఇక సహజవైర మెక్కడకలదు? మరియొకవిషయము జ్ఞాపక ముంచుకొనుడు. హిందూ మహ్మదీయులు పోరాటములు నూనుకొనుట బ్రిటిషువారి రాజ్యస్థాపనకు తరువాతనే యని యనుకొనరాదు. హిందువులు మహమ్మదీయపరిపాలనలోను మహమ్మదీయులు హిందూపరిపాలనలోను చక్కగా వర్ధిలిరి. ఇరుప్రక్కలవారును పరస్పరము పోరాడుకొనుటఆత్మహత్యకు మార్గ మని యెరింగికొనిరి. కత్తికట్టినమాత్రాన ఒండొరుల

మతము వీడుదురనుటను మరచిపోయిరి. రెండుపక్షములును ఐక్యముమై జీవింప నిశ్చయించుకొనిరి. ఇంగ్లీషువారిరాకతో మరల నాపోరాటములు ప్రారంభమయ్యెను.

ఇరువాగులవారును పోరాడుకొనునప్పుడు మీచెప్పిన లోకోక్తు లేర్పడినవి. ఇప్పుడు వానిని తడవుట నష్టదాయకము. హిందూమహమ్మదీయు లనేకులు నేటిదినము ఏకమూలపురుషుని పేర్కొనుట లేదా ? వారిరక్తము వీరియందు వీరిరక్తము వారియందు ప్రవహించుచున్నదిగదా ! మతము మార్చినంతనే మానవులు విరోధు లగుదురా? హిందువులదైవము మహమ్మదీయులదైవమునకంటె భిన్నమా ? మతములొకే గమ్యస్థానమునకు జేర్చుమార్గములు కావా? గమ్యస్థాన మొక్కటే యైనప్పుడు మన మేమార్గము ననుసరించిననేమి ? పోట్లాడుకొనుటకు కారణ మేమికలదు ?

అంతియే కాదు. శైవులకును వైష్ణవులకును సంబంధించిన లోకోక్తులెంతటి బలవద్విరోధమునో సూచించునట్టివియున్నవి. అయిన వీరేకజాతివారుకారని యెవ్వరును అనుట లేదు. వేదాధారమతము జైనమతముకాదు. అయిన నీ రెండుమతముల వారును భిన్నజాతులుకారు. నిజమిది. మనముదాసులమైనాము. అందుచేత ఒండొరులతో పోరాడుకొని మనపోరాటమును మూడవవానిమూలకముగా తీర్చుకొన నిచ్చగించుచున్నాము.

మహమ్మదీయులలో విగ్రహవిచ్ఛేదకు లెట్లుకలరో హిందువులలోకూడ నట్టివారుకలరు. మనము విజ్ఞానాభివృద్ధినందినకొలది మతేతరులతో పోరాడ నవసరములేదనుట దృఢతరముగా నర్థము కాగలదు.

చదువరి: గోరక్షనుగురించి మీయభిప్రాయము విన వలతును.

సంపా: నాకు గోవునెడ గౌరవముకలదు. ప్రేమపూర్వకమగు పవిత్రభావమున్నది. భారతభూమివ్యవసాయక దేశము. గోసంతతిమీద నాధారపడినది. కావున గోవు హైందవభూమికి శరణ్యము. గోవుఇంకను వేయివిధముల నుపయోగకారి. మహమ్మదీయ సోదరు లిది కాదనరు.

కాని నేను గోవును గౌరవించునట్లే సోదరప్రజనుకూడ గౌరవింతును. మానవుడు హిందువుకాని మహమ్మదీయుడు కాని గోవువలెనే యుపయోగకారి. ఇట్లుండ గోవునురక్షించుటకుగా నేనుమహమ్మదీయునితో పోరాడుట కానిఆతనిని సంహరించుట కాని తగునా? అట్లుచేయుదునేని నేనుమహమ్మదీయ సోదరునకును గోవునకును రెంటికిని శత్రువునగుదును. కాబట్టి గోరక్షణకు ఒక్కటేమార్గము. మహమ్మదీయసోదరుని దరిసి దేశక్షేమమునకు నాతోకలిసి గోవును సంరక్షింపవలసినదని అతనిని వేడికొందును. అతడంగీకరింపడేని కార్యము నాకు

వసాధ్యముకావున గోవును పోనిచ్చుట తప్పదు. గోవునెడల నా కత్యంతప్రియంబైనయెడల దానిసంరక్షణకై నాప్రాణము సమర్పింపవలసినదే తప్ప అంతకయి యొరులప్రాణము కోనరాదు. ఇది మనమతముయొక్క సిద్ధాంతమని నావిశ్వాసము.

మనుష్యులు పెడబుద్ధులైనప్పుడు పరిస్థితి విషమ మగును. నే నేదాడనిన మహమ్మదీయసోదరుడుకోదాడనును. నేనుగంభీరదృష్టినటించిన అత డట్టిరీతినే ప్రత్యుత్తరమిడును. అతనికి నే మర్యాదగా నమస్కరించిన అతడు పదింత లెక్కువమర్యాదతో నమస్కరించును. అట్లు చేయడేని నేనమస్కరించుట దోషమని యెవ్వరును ననబోరు. హిందువు లెప్పుడు పోరుపెట్టిరో ఆనాడు గోహింస మిక్కుటమయ్యెను. నాయభిప్రాయమున గోరక్షకసభలు నిజముగా గోహింసకసభలు. అట్టిసభలవసరమైయుండుటయే మనకులజ్జాకరము. గోరక్షణమార్గము మనము మరచినందుచేతనే ఈసభ లవసరమైనవి.

రక్తసంబంధిసోదరుడు గోసంహారమునకు కడంగినాడు. నేనేమి చేయవలెను ? అతనిని పైబడి సంహరింపవలెనా లేకున్న నతనిపాదములబడి ప్రార్థింపవలెనా ? రెండవమార్గమే అవలంబనీయ మందురు కదా! ఇప్పుడు మహమ్మదీయసోదరుని యెడ నవలంబింపవలసినమార్గ మదియేకదా ?

హిందువులు గోవులను హింసించి నశింపజేయుట లేదా? అప్పు డెవరు వానినిరక్షించుచున్నారు. గోసంతతిని కర్రలతో

పొడిచి కన్నకష్టములబెట్టు హిందువు లెందరులేరు? అప్పు డెవరు సంరక్షణకర్తలు? ఇదెల్లయు మనయేకజాతీయత కడ్డ ము వచ్చినదా?

తుదివిషయము. హిందువు లహింసావాదులును మహమ్మదీయులు తదితరులును అగుట నిజమే యయినచో హిందువుల ధర్మమేమి? అహింసామతానుసారి సోదరమానవుని చంపవచ్చునని ఎవరు లిఖించిరి? అతనికొక్కటే ఋజుపథము. ఒకజీవమును కాపాడుట కింకొకని జంపరాదు. మనసు కరగునట్లు ప్రార్థింపవచ్చును. అంతియే తనధర్మము.

ఇక, ప్రతిహిందువు అహింసావాదియేనా? బునాదులకు దిగి ఆలోచింతుమేని మనలో నొక్కడుకూడ అహింస మతముగా బ్రతుకుట లేదు. మనము ఏదోయొకరీతిని జీవహింస చేయుచునే యున్నాము. హిందువులలో అనేకులు మాంసాహారులున్నారు. వారెట్లుంగినిగూడ అహింసావలంబకులుగారు. హిందువులహింసాపరులుమహమ్మదీయులు కారు, కాబట్టి వీరికి పొత్తుపొసగదు, అనువాదము ఈకారణముచేత మృషావాదము.

స్వార్థపరులగు ఆచార్యబృవు లీ గందరగోళమునంతయు కల్పించుచున్నారు. ఇంగ్లీషువారందుకుమెరుగుపెట్టుచున్నారు.

వారు చరిత్రవ్రాయుటయం దొకమార్గము త్రొక్కుదురు; లోకములోని యెల్లరగుణములను అభ్యాసములను వారుగ్రహించుట నటింతురు. దైవము మనకు పరిమితమగు బుద్ధిని ప్రసాదించినవాడు. వారతని ధర్మములను తామే తలధరించి నవనవ ప్రయోగములనన్నియు గావించుచుందురు. తమ కనిపెట్టిన వానినిగురించి తామే అట్టహాసముగా వ్రాసి మనకు నమ్మకము కలుగునట్లుగా మోహమున పడవేయుచున్నారు. మనము జ్ఞానముపై వారిపాదముల కెరగుచున్నాము.

దుర్మతమును దూనదలచుకొనువారు కొరానును చదివి చూడవచ్చును. హిందువులకు అంగీకారార్హములైన సూత్రములందు నూర్లకొలదికలవు. అదేరీతిని భగవద్గీతలోను మహమ్మదీయుల కేమాత్రమును అభ్యంతరార్హములుకాని సూత్రములెన్నియో యున్నవి. కొరానులో నాకర్థముకానట్టివో నాకు రుచింపనియట్టివో వాక్యము లున్నవని నేనుమహమ్మదీయులతో పోట్లాడుదునా? ఇరుపక్షములున్నగాని పోట్లాట పొసగదు. కాబట్టి నేను మహమ్మదీయసోదరునితో పోట్లాడ నిచ్చగింపనేని నాపై పోట్లాటను తెచ్చి పడవేయజాలడు. అదేరీతిని పోట్లాటకు తాను సాయముచేయడని మహమ్మదీయసోదరుడనునేని నాకును పోట్లాటకు శక్తి కలుగదు. అంతరాళమున చేయివిసరిన చేయినొప్పిపట్టవలసినదే కాని మరేమియుకాదు. ఆచార్య

బృవుల కాకరమీాక ప్రతివాఁడును తన మతమునందలి సత్యము నెరింగినచో పోట్లాటలకు అవకాశమే యుండదు.

చదు వరి: మనఇరుతెగలను ఇంగ్లీషువా రెప్పటికైనను చేర నిత్తురా ?

సంపా : మీా యధైర్యమే ఈ ప్రశ్నకు కారణము. మన తెలివితక్కువకిది తార్కాణము. ఇద్దరు సోదరులు సుఖముగా శాంతముగా బ్రదుక దలచుకొనినయెడల మూడవవానికి చెరుపసాధ్యము? దుష్టబోధలను వినినచో వారిని మన మవివేకులమనము? ఇంగ్లీషువారు హిందూమహమ్మదీయుల విభేద పరుపగలిగినయెడల అది మనలోపమేకాని వారిలోపమంతగా కాదు. మృద్ఘట మొక్కరాతితాకుడునకుగాకున్న మరియొక్క రాతి తాకుడునకైనను పగులగలదు. కాబట్టి ఆ ఘటమును సంరక్షించుటకు మార్గము రాయిరప్పనుండి దూరము తీసుకొనిపోవుటగాదు. చక్కగా కాల్చి బలపరచుటయే పరమ సాధనము. మనహృదయములు మట్టివి కాకూడదు. వజ్రసన్నిభములుగా తప్తములైనవి కావలెను. అప్పుడు సర్వాపాయములనుండి సంరక్షితుల మగుదుము. ఈపని హిందువు లెక్కువగా చేయవచ్చును. వారు సంఖ్యలో నెక్కువ. విద్యావంతులనికూడ చెప్పుకొందురు. అందుచేత హిందూమహమ్మదీయసఖ్యము చెడకుండ కాపాడుటకు వా రెక్కువ సమర్థులు.

పరస్పరము ఈరెండుసంఘములకు అవిశ్వాసము కలదు. మహమ్మదీయు లందుచేత పూర్ణ్రప్రభువునొద్ద కొన్ని ప్రత్యేక స్వాతంత్ర్యములు కోరుచున్నారు. దీనిని హిందువు లేల ప్రతి ఘటింపవలెను? హిందువులుప్రతిఘటింపకయుండినచో ఇంగ్లీషు వారికది మనసున కెక్కును. మహమ్మదీయులు క్రమముగా హిందువులను విశ్వసింతురు. సోదరభావము ఫలించును. ఇంగ్లీషువారిపద్దకు మనవిభేదములను తీర్పునకు కొనిపోవుట సిగ్గు మాలినతనము. ఊరకుండిన హిందువునకు నష్టములేదనుట యెవ్వరికైనను అర్థము కావలసినదే. ఒకడు రెండవవానికి విశ్వాసపాత్రుడగునేని మొదటివానికి నష్ట మెక్కడను సంభవింపదు.

హిందూమహమ్మదీయు లెప్పుడును పోట్లాడుకొనరని నే ననువాడనుకాను. ఏకకుటుంబములో నివసించుసోదరు లే యెన్నివిషయములలోనో కలహింతురు. నెత్తులు పగులగొట్టు కొందురు. అట్లు జరుగవలెననుట అవసరముకాదు. కానియెల్లరు లోకమున సమభావులుకారు. ఆగ్రహావేశులైనప్పుడు మనుష్యు లెన్నియో వివేకవిహీనప్రవర్తనలపాలగుదురు. ఇవియన్నియు మనము భరింపకతీరదు. అయిన, మనముపోట్లాడుకొనినప్పుడు ఇంగ్లీషు న్యాయస్థానములకుగాని మరియే న్యాయస్థానము లకుగాని పోనక్కరలేదు. న్యాయవాదుల నియమించుకొన

నవసరము లేదు. ఇరువురు పోట్లాడినారు. అందులో ఇరువు రకో ఒక్కనికో శిరస్సు బ్రద్దలైనది. మూడవవాడు వీరికి న్యాయము తీర్చు టెట్లు? పోట్లాడువారికి గాయపడుదు మేయను జ్ఞాన ముండవలదా?

## పదునొకండవ ప్రకరణము.

---

### భారతభూమిస్థితి.

### న్యాయవాదులు.

చదువరి: మీరనున దేమి? ఇరువురు పోట్లాడుకొనినప్పుడు వారు న్యాయస్థానమునకు పోరాదా? ఇది చిత్రముగానే యున్నది.

సంపా: మీరు చిత్రమన్నను మరియేమన్నను నేజెప్పినది నిజము. మీవేసిన ప్రశ్నవలన మనము న్యాయవాదులను గురించియు వైద్యులనుగురించియు ముచ్చటింపవలసియున్నది. నాయభిప్రాయమున న్యాయవాదులచే దేశము దాసత్వమందినది. హిందూమహమ్మదీయవిభేదములు పెరిగినవి. ఆంగ్లాధికారము స్థిరపడినది.

చదువరి: ఈ నేరములుమోపుట సులభము కాని ఋజువు చేయుట మీతరముగాదు. న్యాయవాదులుకాకున్న మరి యెవ్వరు మనకు స్వాతంత్ర్యమార్గమును చూపియుండగలరు? బీదల నెవరు సంరక్షించి యుండగలరు? న్యాయము నెవరు స్థాపించియుండగలరు ? ఉదాహరణార్థము, గతించిన మన మోహన ఘోషుగారు ప్రతిఫలముకోరక ఎందరనో బీదలను

న్యాయస్థానములలో వాదించి రక్షించిరి. మీరు ఎంతో పొగడిన దేశీయమహాసభ న్యాయవాదులు పనిచేయకున్న రూపముతోనే యుండదు. ఇంతటివారగు న్యాయవాదులతెగను దూషించుట న్యాయము నన్యాయముచేయుటగా నున్నది. వారిని బూతులాడుటచే పత్రికాస్వాతంత్ర్యమును అపవిత్ర మొనర్చుచున్నారు.

సంపా: ఒకప్పుడు నేను మీవలెనే అభిప్రాయపడియుంటిని. వారు యేమియు మేలు చేసినవారే కాదని ధృవపరచుట నా కవసరముకాదు. ఘోసుగారిని స్మరించికొనిన నా కెంతో గౌరవము. అతడు బీదలకు సాయపడెననుట నిజము. దేశీయ మహాసభ న్యాయవాదులకు కొంత ఋణపడి యుండుట సంభావ్యము. వకీళ్లు మనుష్యులే. ప్రతి మనుష్యునిలోను కొంతగుణము కలదు. ఎక్కడెక్కడ వకీళ్లు మేలుచేసినారని చెప్పవచ్చునో అక్కడక్కడ ఆలోచించి చూచునెడల వారి మానవస్వభావము అందులకు కారణముగా దోచగలదు. వారి న్యాయవాదిత్వముచే చేసిన మేలేమియు నుండదు. నేనుమీకు తెలుపదలచుకొనునదంతయుఇది. ఆవృత్తి అవినీతికి ఆకరము. అందులోదొరకుకొనినవారు దానిమోహమునుండి తప్పించుకొనుట యరిది.

హిందువులుమహమ్మదీయులు పోట్లాడుకొనినా రనుకొందము. సామాన్యమానవుడు వారిని ఆ విషయమే మరచి

పొం డనును. ఇరుపక్షముల లోపములేక పోట్లాట రాదనును. మరి పోట్లాడవలదని బుద్ధిచెప్పును. వారు వకీళ్లవద్దకు పోదురు. వకీళ్లు తామంగీకరించు పక్షమువారితో నొకటయిపోయి వారిని న్యాయమనిపించుటకు సాధనము లాలోచింపవలసియుందురు. అసలుపక్షమువారికి ఈసాధనములు తోచనుగూడ తోచవు. కాని ఈధర్మమునెరవేర్పనియెడల వకీలు తనవృత్తికికళంకము తెచ్చినవాడగును. కాబట్టి సర్వసామాన్యముగా వకీళ్లు కలహములను త్రుంచుటకు బదులు పెంచువా రగుచున్నారు. ఇంతేకాదు. ఆవృత్తిలో చేరువారు ఎక్కువగా ఇతరులకుసహాయముచేయవలెననిచేరువారుకారు. తాము కుబేరులైన చాలునని వారియుద్దేశము. వకీలువృత్తిఐశ్వర్యమార్గములలోనొకటికాబట్టి వకీళ్లకు కలహములు పెంచుటమీదనే దృష్టి. మనుష్యులు తమలోతాము వివాదపడినచోట వకీలుకు సంతోషమనుట నే నెరిగినసంగతి. చిన్నవకీళ్లు కృత్రిమకలహములను సృష్టించుటకూడ కలదు. మధ్యవర్తులా బీదలరక్తమును పీల్చిపిప్పిచేయుదురు. వకీళ్లకు నిజముగా పనిలేదు. సౌఖ్యలోలురగు నుద్దేశముతో సోమరిపోతు లీవృత్తి నవలంబింతురు. ఇది నిజము. మరి యేవాదమైనను చెప్పుదు రేని అది వట్టి బూటకము. వకీలువృత్తి గౌరవపాత్రమని కనిపెట్టినవారువకీళ్లే.తమ గౌరవపాత్రతను సిద్ధముచేసినట్టులే వారు శాసనములనుగూడ

సిద్ధముచేయుదురు, ఏమిరుసుములు తీసికొనవలెనో వారే నిశ్చ యింతురు. ఏదో మహోపకారముచేసినట్లు నటించి బీద లోహాయను నట్లొనర్తురు.

సాధారణకార్మికులకంటె వారికేల యెక్కువ రుసుము చెందవలెను? వారి యవసరము లేల అంతకంటెను నెక్కువ? సామాన్యకార్మికులకంటె వీ రెట్లు దేశమున కెక్కువయుప యోగకారులు? ఎక్కువమేలుచేయువారి కెక్కువద్రవ్యము చేరవలెనా? ద్రవ్యముకొరకు వారు దేశమునకు మేలుచేయు నెడల దాని నెట్లు మేలుగా గణింపవచ్చును?

హిందూమహమ్మదీయవివాదములను గురించి కొంచె మైనను ఎరింగినవారు అవి పలుమరు వకీళ్లమూలకముగా జనిం చిన వనుటను గుర్తింపగలరు. కుటుంబములు వారివలన నశిం చినవి. వారు సోదరులను శత్రువుల నొనర్చినారు. సంస్థాన ములు వకీళ్లఅధీనమున జిక్కి అప్పులకుప్పలైనవి. కొందరు సర్వస్వమును ధారపోసికొనినారు. ఇట్టి సంగతు లూరకపెంచి చెప్పవచ్చును.

వకీళ్లుదేశమునకుచేసిన అపచారములలోనెల్ల పెద్దది ఇంగ్లీషు వారిపట్టును బలవత్తమ మొనర్చుటయె. న్యాయస్థానములు లేకపోయినయెడల ఇంగ్లీషువారిరాజ్యపరిపాలనసాధ్యమగునా? ప్రజలమేలునకయి న్యాయస్థానము లేర్పడినవని యాలో

చించుట పొరబాటు. తమయధికారమును నిలవబెట్టికొన నాలోచించువారు న్యాయస్థానములమూలకముగా ఆపనిని నిర్వహింపజూచుచున్నారు. ప్రజలుతమలోనికలహములనుతీర్చుకొనగలుగునెడల మూడవవానికి అధికారమే దొరకదు. యుద్ధములుచేయుటచేతనో బంధువులమూలకముగనో కలహములు తీర్చుకొనునప్పుడు మానవుడు మానవత్వము లేనివాడయ్యెను. న్యాయస్థానములకు పోవునప్పటికి అంతకంటెనుపౌరుషవిహీనుడైనాడు. ద్వంద్వయుద్ధమున వివాదముతీర్చుకొనుట అనాగరకమనుట నిస్సంశయము. నాకును మీకును కలవివాదమునుతీర్చుటకుమూడవవానిని నియమింతునేని అదియంతకంటెనుతక్కువ యనాగరకమగునా? మూడవవాని తీర్మానము ఎల్లప్పుడును సరికాజాలదు. వివాదపడినవారికే తెలియును తమలో ఎవ్వరిదిన్యాయమో, ఎవ్వరిది కాదో. అట్లుండగా మనము మన యమాయకత్వముచేతను, అజ్ఞానముచేతను మనద్రవ్యముఁతీసికొనిన మూడవవాఁడు మనకు న్యాయము కలుగచేయునని భ్రమపడుచున్నాము.

ముఖ్యముగా జ్ఞాపక ముంచుకొనదగినదిది. న్యాయవాదులు లేక న్యాయస్థానములు స్థాపితములై యుండవు. న్యాయస్థానములు లేక ఇంగ్లీషుపరిపాలన అసాధ్యమైయుండును. ఇంగ్లీషు న్యాయాధికారులు, ఇంగ్లీషున్యాయవాదులు, ఇంగ్లీషు పోలీసు

ఉన్నయెడల వారు ఇంగ్లీషువారినిమాత్రమే పరిపాలించుట వీలగును. హైందవన్యాయవాదులు, హైందవన్యాయాధికారులు లేనిచో ఇంగ్లీషువారికి మార్గమేయుండదు. వకీళ్లెట్లు ఏర్పాటైరో, వారెట్లు ప్రోత్సహింపబడిరో మొదట వివరింపవలసియున్నది, అప్పుడు ఆవృత్తియెడల నాకెంత అసూయ కలదో మీకును అంతియే అసూయయుండును. న్యాయవాదులుత్తమవృత్తి దాసివృత్తివంటిదని గుర్తించివదలివేయుదురేని ఇంగ్లీషుపరిపాలన ఒక్కనాటిలో అసాధ్యముకాగలదు. మీానములునీటినివలె హైందవులమైనమనము వివాదమును న్యాయస్థానములను ప్రేమింతుమను నింద మాసకు కలుఁగుటకు వారే ఉత్తరవాదులు. న్యాయవాదులనుగురించి నే చెప్పినది సహజముగానే న్యాయాధికారులకుకూడ నన్వయించుచున్నది. వారు జ్ఞాతులు; ఒకరికొకరు సహాయులు.

---

# పంద్రెండవ ప్రకరణము.

---

## భారతభూమిస్థితి.

### వైద్యులు.

చదువరి: వకీళ్లనుగురించినాకిప్పు డర్థమయినది. వారుచేసిన మేలు ఆకస్మికము కావచ్చును. ఆవృత్తి నీచమని నాకు తోచు చున్నది. మీరువైద్యులనుకూడ లాగివైచుచున్నారే! అదియెట్లు?

సంపా: నేను తమకు తెలుపునభిప్రాయములు నావికావు. నేనును అంగీకరించినవే. పాశ్చాత్యరచకులు న్యాయవాదులను గురించియు వైద్యులనుగురించియు కఠినతరముగా వ్రాసినారు. అందులోనొక్కరు నేటి నాగరకపద్ధతినంతయు ఉపాసవృక్షమునకు పోల్చినారు. పరోపజీవికలగువృత్తు లావృక్షమునకు శాఖలు. ఇందులో న్యాయవాదివృత్తి, వైద్యవృత్తి చేరియున్నవి. మొదలింటిమీాద మతమను గొడ్డలి పెట్టినారు. వేరు శాశ్వతత్వము. మీాకు ఇందుమీాదట అభిప్రాయమంతయు నాదికాదనుట సులభగ్రాహ్యము. అనేకులేకకాలమున యాలోచించినదనుటయు తెల్లమే. ఒకప్పుడు వైద్యవృత్తియనిన నాకు బహుప్రేమ. దేశముకొరకయి వైద్యుడు కావలయునని నాకుద్దేశముండినది. ఇప్పుడాయుద్దేశము నాకు లేదు. మనలోని నాటువైద్యులకేల గౌరవపదవి రాలేదో యిప్పుడునాకర్థమయినది.

మనపై అధికారము నిలుపుకొనుటకు ఇంగ్లీషువారు వైద్యవృత్తినిబహుచక్కగావినియోగించినారు. రాజకీయలాభమును సంపాదించుటకు ప్రాచ్యఖండవాసులగు సంస్థానాధీశ్వరులపట్ల ఇంగ్లీషువైద్యులు తమవృత్తిని వినియోగించినట్లు నిదర్శనములున్నవి.

వైద్యులు మనబునాదులనే చెరపినారు. ఏమిరానినాటువైద్యులే సున్నితులైన నేటివైద్యశిఖామణులకంటె మెరుగని నాకొకొకప్పుడు తోచుచున్నది. ఆలోచించి చూతము. దేహమును కాపాడుట వైద్యునివృత్తి. సరిగనాలోచించిననదియును గాదు. దేహమును బాధించు రుజలను పోనాడుట వారివిధి. ఈ రోగము లెట్లు కలుగుచున్నవి? నిజముగా మనయజాగ్రత్తవలన, మనవిషయలోలత్వమువలన. నేనూరకతిన్నాను. అజీర్తికలిగినది. వైద్యునికడకు పోయినాను. అతడుమందిచ్చినాడు. నాకు బాగైనది. మరల ఇష్టముకొలది మెక్కినాను. మరల అజీర్తియయినది. మరలవైద్యునిచేతిమాత్రలుమ్రింగవలసినదే. మొదట మాత్రలు మ్రింగనిచో నాకుతగిన శాస్తియగును. మరల మితిమీరి తినను. అంతటితో అజీర్తి నిలిచిపోవును. వైద్యుడడ్డుతగిలి నావిషయలోలత్వమును ప్రోత్సాహపరచినాడు. అందువలన దేహమేమో బాగుపడినదికానినామానసముమాత్రము శక్తివిహీనమైనది. మందులూరక త్రాగుచుండిన మానసము మంటగలియవలసినదే.

నేనేదో తప్పుదారి త్రొక్కినాను. రుజపైబడినది. వైద్యుడు బాగుచేయును. తరువాత నూటికితొంబదితొమ్మిదిపాళ్లుమరల తప్పుదారి త్రొక్కుదుననుట నిశ్చయము. వైద్యుడు అడ్డ పడనిచో స్వభావానుగుణముగ ఫలముకలిగియుండును. నన్ను నేను సంరక్షించుకొనుశక్తి యలవడును, నాతప్పుదారి తప్పి యుండును, నాకు సంతోషము కలిగియుండును.

ఆసుపత్రులు పాపమును పెంచునట్టిసంస్థలు. ఇవికారణముగా మనుష్యులు తమశరీరములను గురించి తక్కువజాగ్రత్తగా నుందురు. కావున అవినీతి ప్రబలిపోవుచున్నది. ఐరోపియను డాక్టరులు అధములు. దేహమును సంరక్షించుకొనుటనుగురించి పొరపాటు అభిప్రాయము మనసులో నిడుకొని వీరుసంవత్సరము సంవత్సరము వేనవేలు జీవములను హింసించుచున్నారు. ఇది యేమతముకూడ అంగీకరించినది కాదు. మనదేహములనుసంరక్షించుకొనుటకుఇన్నిజంతువులను చంపనక్కరలేదని అందరును అంగీకరించుచునే యున్నారు

ఈడాక్టరులు మనమతాభిమానమును చెడుపుచున్నారు వారి మందులలో ఎక్కువవానియందు క్రొవ్వుగాని మత్తు ద్రవములుకానికలియుచున్నవి. వీనిరెంటిని హిందూమహమ్మదీయమతములు రెండును నిషేధించినవి. నాగరకమను నాటకము మనమాడవచ్చును. నిషేధితములన్నియుమూఢవిశ్వా

సములని యూడవచ్చును. ఇచ్చవచ్చిన యనుభవములలో నోలలాడవచ్చును. అయిన ఇందులో నిజమేమియందురా? డాక్టరులు మనకీయనుభవములను పట్టించుచున్నారు. మనము ఆత్మనిగ్రహము లేనివారమయినాము. పౌరుషవిహీనత్వము మనపాలైనది. ఈకారణములచేత దేశసేవచేయుటకుమనమన ర్హులము. యూరోపియను వైద్యము నేర్చుకొనుట మన బానిసత్వము దృఢతరము చేసికొనుటయే.

వైద్యవృత్తియేల అవలంబించుచున్నామో ఆలోచించుట ఆవసరము. లోకమును సేవించవలెనని మాత్రము కాదు. గౌరవము ఐశ్వర్యము సంపాదించుటకే మనము డాక్టరులగుచున్నాము. అవృత్తిలో నిజమైన లోకసేవ యేమాత్రములేదనియు దానివలన లోకమునకు అపకారమనియు చూపుటకు నే నిదివరకు ప్రయత్నముచేసితిని. డాక్టరులు తమకు గొప్పజ్ఞానము కలయట్లు నటించి పెద్ద పెద్దమొత్తములు లాగుదురు. రెండుదమ్మిడీలు చేయనిమందును వారు రూపాయలురూపాయలుపెట్టి యమ్ముదురు. పిచ్చినమ్మకముచేత తమకు కలరోగముకుదురునను భ్రమచేత ప్రజ ఈమందులను కొందురు. ఇదంతయు చూడగా ప్రజాహితమునెంతయోనెత్తినవేసికొనునట్లునటించుడాక్టరులకంటె, మనయెరుకలో నుండునట్టినాటువైద్యులే మేలుగారా?

---

## పదిమూఁడవ ప్రకరణము.

---

### నిజముగా నాగరకమన నేమి ?

చదువరి: మీరు రైళ్లను ఖండించితిరి. వకీళ్లను ఖండించితిరి. వైద్యులను ఖండించితిరి. యంత్రసామగ్రినంతయు ఖండింతురనుట నాకు స్పష్టము. అట్లయిన నిజముగా మీరు దేనిని నాగరక మందురో ?

సంపా: ఈప్రశ్నకు ప్రత్యుత్తరము కష్టముకాదు. భారతభూమి నిర్మించుకొని వచ్చియుండు నాగరకము లోకమున మఱెక్కడను లేదు. మన పూర్వికులు వైచినవిత్తనమును బోలు గట్టివిత్తన మింకెక్కడను దొరకదు. రోము గతించె, గ్రీసుచనె. అసమానులు ఫేరోలు తరలిరి. జపానుపాశ్చాత్యవేషమును ధరించె. చీనానుగురించి యేమియు చెప్పరాదు. అయిన భారతభూమిమాత్ర మెట్లెట్లో ఇంకను అస్థిభారములలో చక్కగ నిలిచియున్నది. ఎన్నడో నాగరకమునను౦డిన గ్రీసురోములవద్దనుండి యూరోపియనుజాతులు పాఠములు చదువుకొనుచున్నారు. అట్లు నేర్చుకొనుటలోకూడ గ్రీసురోముల లోపములను మానుట తలపెట్టకున్నారు. ఇది జాలికరమగు స్థితి. ఇంతటిమధ్యన భారతభూమి నిశ్చల

పై నిలచియున్నది. ఇదియే ప్రతిభ. భారతపుత్రులు ఏమాత్ర ము మార్పు చెందుటకును అంగీకరించరట. ఇది యజ్ఞానమట, మౌర్ఖ్యమట, భారతీయు లంత యనాగరకులట. ఈదోషారోపణ నిజముగా మన సుగుణమును ఖండించుట యయియున్నది. అనుభవముచే బాగుగా పరిశీలించి గడించినదానిని నిజ మని యెరింగినదానిని మనము మార్చుటకు రాదు. భారతభూమి నెత్తిన నెంతో సలహాలను క్రుమ్మరించుట కెందరో ప్రయత్నించుచున్నారు. మనము వినుట లేదు. ఇందులో సారస్యమిది,ఇదియే మన యాశలన్నిటిని నెఱవేర్చగల యాధారము.

ఏమార్గము మానవునకు స్వధర్మోపదేశమును చేయునో అదియే నాగరకము. ధర్మనిర్వహణము, నైతికప్రవర్తనము ఇవి రెండును చాలమట్టుకు అభేదములు. నైతికప్రవర్తనముచే మనస్సును ఇంద్రియములను నిగ్రహింతుము. తన్మూలమున ఆత్మస్వరూపము నెరుంగుదుము. నాగరకము అనుపదమునకు గుజరాతీభాషలో నీతిప్రవర్తనము అనునర్థమిచ్చుపదము నుప యోగింతురు.

ఈపదార్థము నిజమగునేని అనేకులు గ్రంథకారులు వ్రాసియుండురీతిని పరులనుండి భారతభూమినేర్చుకొనదగినదేదియు లేదు. ఇది న్యాయమే కదా. మానసము నిలకడ లేని పక్షి. ఎంత అలవడిన నంత దీనికికోరిక. నిరంతరమిదియసంతుష్టమే.

మనమెంతటి సంతోష మింద్రియములకు కలిగింతుమో అంత యెక్కువగా నవి ఆశలననంతము చేయుచుండును. కాబట్టి మన పూర్వీకులు మనభోగములకు మట్టు లేర్పరచిరి. సౌఖ్యము మానసికస్థితి యనుటను గ్రహించిరి. ద్రవ్యమున్నంతమాత్ర మున మానవుడుసుఖికాడు. ద్రవ్యము లేనందున బీదవాడు సౌఖ్యము లేనివాడుకాడు. కోట్లకొలది ప్రజ యెల్లప్పుడుబీదలే. ఇదంతయు గమనించియే మన పెద్దలుమనలనుభోగములనుండి భాగ్యములనుండి వారించిరి. వేలయేండ్ల క్రిందనుండిన నాగటి వంటి నాగటితోనే మనము కాలముగడుపుచున్నాము. పూర్వ పుకుటీరములపోలు కుటీరములే నేటికినిమనకు నిలుచుటకాధా రములై యున్నవి. మన దేశీయవిద్యకూడ నాటిదే నేడు. జీవిత మును మర్భరముచేయు పోటీపద్ధతి మనదికాదు. ప్రతివాడును తనవృత్తినివ్యాపారమును చేసికొని తదనుగుణమగు ద్రవ్య మును సంపాదించును. యంత్రములు చేయుటకు మన పెద్దలకు తెలియదనరాదు. అయిన మనము అనుభోగములపయి ఆశ పెట్టితిమేని వానికి దాసులమగుదుమనుట వారెరుగుదురు. మన నైతిక జీవనము నశించుననుటయు వారుగమనించిరి. బాగుగ నాలోచించి వారందుచేతనే మనకు దైవమిచ్చిన కాలుసేతులు పయోగించి యెంతపని చేయవచ్చునో అంతమాత్రము పనినే నియోగించిరి. మనయవయవముల సద్వినియోగమే నిజముగ

సౌఖ్యమునకును ఆరోగ్యమునకును కారణభూతముకాని మరి యొకటి కాదనుటను వారు గ్రహించిరి. ఇంతే కాదు. గొప్ప గొప్పనగరముల నిర్మాణముకూడ వ్యర్థమనియు దోషాకరమ నియు వారు కనిపెట్టిరి. అట మానవుడు సుఖపడజాలడు. దొం గలు, దోపిడికాండ్రు ఎక్కువగ నుందురు. దుష్టవృత్తులు మెం డగును, భాగ్యవంతులు బీదలను దోచికొందురు. కాబట్టిమన పూర్వికులు చిన్నగ్రామములను నిర్మించుకొనుటతో సంతృప్తి పొంది యుండిరి. రాజులకత్తులు నీతికత్తికి లోకువయనుటవారి నమ్మిక. కాబట్టి ఋషులు, ఫకీరులయెదుట సార్వభౌములు తక్కువయని సిద్ధాంతీకరించిరి. ఇట్టి యమోఘసిద్ధాంతముల కాకరమయినజాతి ఇతరులకు గురుపదముననుండదగినదే కాని ఇతరులనుండినేర్చుకొనదగినదికాదు. మనజాతివారుకూడ న్యా యస్థానములు, న్యాయవాదులు, వైద్యులు అనుసంస్థలను ఎరుం గుదురు. కాని వీనికెప్పుడును మితియేర్పడియుండును: ఈవృత్తు లెంతో గౌరవాస్పదములు కావనుటను ప్రతివాడును అంగీక రించుచుండెను. అంతేకాక వకీళ్లు, వైద్యులు ప్రజలను దోచు కొనుచుండలేదు. వారు ప్రజలనౌకరులుగా నెంచబడుచుండిరి గాని యజమానులుగా నెంచబడుచుండలేదు. న్యాయవిచారణ సాధారణముగాసరిగానుండినది, న్యాయస్థానములకుపోకుండుట నాటిసామాన్యసూత్రము. మానవులను అందులోనికి ప్రవేశ

పెట్టు నేటిమధ్యస్థు లప్పుడు లేరు. ముఖ్యపట్టణములలో వాని చుట్టుపట్టును ఆమాత్రము న్యాయస్థాన విచారమైన నుండినది. సాధారణముగా ప్రజతమ గ్రామములలో తాము స్వతంత్రముగా జీవించుచు వ్యవసాయాదికములను చేసికొనుచుండిరి. స్వరాజ్యమును అనుభవించుచుండిరి.

నేటినాగరకము దూరనియట్టిఘట్టములలో భారతభూమి నేటికిని పూర్వమువలెనే యున్నది. అక్కడివారు మనలను చూచునప్పుడు మనసవనమార్గములను నవ్వుదురు. వారిపై ఇంగ్లీషు అధికారమునులేదు. మీయధికారమునునుండబోదు. ఎవరి ప్రతినిధులము మనమని మాటలాడుచున్నామో వారిని మన మెరుగము. వారు మనల నెరుగరు. మీరును మీవలె దేశాభిమానులైనయితరులును నాతో చేరిని యట్టిప్రదేశములకు పోయి అచ్చట ఆరుమాసము లుండి రావలసినదని నా యిష్టము. అప్పుడు దేశాభిమానముతో మీరు స్వరాజ్యమును గురించి మాటలాడవచ్చును.

నిజమైన నాగరక మనగా యర్థమేమో ఇప్పుడు మీకు తెలిసియుండును. నేనువర్ణించియుండు ఈస్థితిగతులను మార్చ దలంచునట్టివారు దేశద్రోహులు. పాపులు.

చదువరి: తామువర్ణించినట్లే భారతభూమియుండునేని బాగుండును. అయిన నీదేశములో ఎందరో బాలవితంతువు లున్నారు. ఎందరకో రెండుసంవత్సరముల వయసుననే శిశువివా

హములు జరుగుచున్నవి. పండ్రెండేండ్ల బాలికలు బిడ్డలగని సంసారముబరువు మోయుచున్నారు. స్త్రీలుబహుభర్తృకలును కలరు. నియోగములు నడచుచునేయున్నవి. మతముపేరుపెట్టి స్త్రీలు వ్యభిచారమునువృత్తిచేసికొనుచున్నారు. దేవతలకుప్రీతి యని మేకలు గొర్రెలు హతమగుచున్నవి. మీరువర్ణించిననాగరకమున కివిగూడ చిహ్నములనియే మీయభిప్రాయమా?

సంపా: మీరు చెప్పునది సరిగాదు. మీరు చూపినలోపములు లోపములే. అవిపూర్వనాగరకమునకుచెందినవనియెవ్వరును భ్రమపడుట లేదు. దానిశక్తిని ప్రతిఘటించికూడ అవినిలచినవి. వానిని నశింపజేయుటకు ఎల్లప్పుడును ప్రయత్నములుజరిగినవి, జరుగుచున్నవి, జరుగగలవు. మనయం దుద్భవించిన నవీనతేజముచే ఈదోషములను పోనాడుకొనుటకు ప్రయత్నింపవచ్చును. నవనాగరక చిహ్నములని నేను వర్ణించినదంతయు దానిచిహ్నములే యని తద్భక్తులే యంగీకరించుచున్నారు. ఏ నాగరకముక్రిందగాని, ఏదేశములోగాని మానవుడు సంపూర్ణత్వము నందినదిలేదు. భారతనాగరకముయొక్కదృష్టి మానవుని నైతికస్వభావమును పెంచుట. నవనాగరకముయొక్కదృష్టి అవినీతిని అధికముచేయుట, దీనికి దైవభక్తి తోడులేదు. దానికి దైవభక్తియే యాధారము. ఈవిధముగా నాలోచించి ఈరీతిని విశ్వసించు ప్రతిభారతీయుడును తల్లియురము వీడని శిశువువలె తన ప్రాచీన నాగరకమును వీడక నడుచుకొనవలెను.

---

## పదునాలవ ప్రకరణము.

---

### భారతభూమి స్వతంత్ర మెట్లగును.

చదువరి: నాగరికమునుగురించి మీరుచెప్పిన యభిప్రాయము లర్థమయినవి. నేను వానిని గురించి మననము చేసికొందును. అంతయు నొక్కపర్యాయముగా గ్రహింగజాలను. ఇట్టి యభిప్రాయములుగల మీరు భారతభూమిని స్వతంత్రము చేయుట కేమిమార్గము చెప్పుదురోయని యెదురు చూచుచున్నాను.

సంపా: నాయభిప్రాయము లొక్కపెట్టున అంగీకృతములగునని నేనునమ్మువాడనుకాను. మీబోటి చదువరులకు నివేదించుటమాత్రము నాధర్మము. కాలము తక్కుంగలపనిని నెరవేర్చును. భారతభూమిని స్వతంత్రమొనర్చు స్థితిగతులిదివరకే వివరించినాము. ఆవివరణమంతయు నేరుగాచేసినదికాదు కావునఇప్పుడట్లు చేసిచూపెదను. రోగకారణమును నశింపచేసిన రోగము నశించుననుట లోకములో అందరకును విశదమయిన సిద్ధాంతమే. అట్లే భారతభూమి దాస్యమునకు కారణమేదో ఆకారణమును తొలగించినయెడల దాస్యమును తొలగుననుట నిజము.

చదువరి: భారతనాగరకమే లోకములో నుత్తమమయిన యెడల భారతభూమికి దాస్యమెట్లు కలిగినది ?.

చదువరి: ఈనాగరకము ఉత్తమమనుటనిర్వివాదాంశము. అయిన ఒక్కటి జ్ఞాపకముంచుకొనవలెను. అన్నినాగరకములును వ్యవహారమున పరీక్షితము లగుచున్నవి. ఏది అచలమో అదియన్నిటిని గెలిచి స్థిరపడగలదు. హైందవపుత్రులు చలించుటనుజేసి భారతనాగరకము ఇకట్టులబడినది. ఎన్నిమహోతరంగములు వచ్చినను కొట్టుకొనిపోవక నిలచుటచేతనే దీనిశక్తి యిట్టిదని బయల్పడుచున్నది. అంతేకాక భారతభూమియంతయుగూడ ఇంకను నీవ్యవహారపరీక్షలోనికిరాలేదు. పాశ్చాత్యనాగరకముసోకినవారు మాత్రము దానికి దాసులైనారు. మానవుడెప్పుడును మహాప్రపంచమును తనజేనడే యని తలంచుట స్వభావసిద్ధము. మనము దాసులైనప్పుడు లోకమంతయుదాస్యము నందినట్లే మనకుదోచును. మన మధోగతిలో నుండుటనుబట్టి భారతభూమియంతయుఅదేగతిలో నున్నట్లుమనముతలపోయుచున్నాము. నిజమరయగా అట్టిస్థితిలేదు. పైసంగతులన్నియు మరువనియెడల మనము స్వతంత్రులమయినయెడల భారతభూమియు స్వతంత్రయగును. ఈభావమే స్వరాజ్యశబ్దమునకు నిర్వచనమును స్థాపించుచున్నది. మనలను మనము పరిపాలించుకొనుయోగ్యతకలిగినప్పుడుమనకు స్వరాజ్యము తప్పకవచ్చినదే.

కాబట్టి అవి మనకు నిజముగా కరతలామలకము. ఈస్వరాజ్యము కలవోలినదని యనుకొని ఊరక కూర్చొనుట పోసగదు. నేను చెప్పినట్టిరూపముగల స్వరాజ్యమును ఒక్కపర్యాయము మనముసంపాదించినయెడలఅందరును దానినిసంపాదించునట్లు మనము ఎల్లప్పుడును ప్రోత్సహింపగలము. దాని స్వభావమే యిట్టిది. అయిన ఆస్వరాజ్యమును ఒక్కొక్కడును ఆత్మానుభవముచేత సంపాదింపవలసియున్నాడు. నీటమునిగి పోనుండు వాడు అట్టిడినే మరియొకనిని ఎప్పుడును తరింపజేయ లేడు. మనము దాసులుగా నున్నంతకాలము ఇతరుల దాస్యమును పోనాడుట కాలోచించుట వట్టిదంభము. ఈకారణముల నాలోచించినయెడల మనము ఇంగ్లీషువారిని వెడలగొట్టు నాదర్శము పెట్టుకొనుట అవసరమే కాదు. ఇంగ్లీషువారుభారతీయులగుదు రేని వారికిని ఇందుతావుగలదు. వారినాగరకము నుంచుకొని వారిక్కడ నుండదలంతు రేనివారి కిక్కడ తావు లేదు. అట్టిపరిస్థితులను సృష్టించుశక్తి మనలో నున్నది.

చదువరి: ఇంగ్లీషువారు భారతీయు లెన్నటికిని కాజాలరు.

సంపా: అట్లనరాదు. ఇంగ్లీషువారిలో మానుషత్వము లేదనవచ్చునా ? వారు తమరీతిని మానుదురా లేదా యనుట ప్రస్తుతమున కవసరముకాదు. మన యిల్లు మనము చక్కగాపెట్టుకొనినయెడల అందులో నివసింపగలవారే నివసింతురు. తక్కం

గలవారు తమకుతామే పడలిపోవుదురు. ఇట్టిది మన యనుభవములో జరుగుచునే యున్నది.

చదువరి: చరిత్రలో ఇట్టి దెక్కడను జరుగలేదు.

సంపా: చరిత్రలో జరుగనిది జరుగనే జరుగదనుట మానవశక్తి గౌరవమును సంకోచించుటయగును. మనకు సత్కార్యమని తోచుదానిని ప్రయత్నించుట మనధర్మము. అన్ని దేశములపరిస్థితులును ఒక్కటే కావు. భారతభూమిస్థితి చిత్రముగా ప్రత్యేకము. దానిశక్తి అనంతము. కావున యితర దేశచరిత్రలతో ఈభూమిని పోల్చనక్కరలేదు. ఇతరనాగరకములు నశించినవి గాని భారతనాగరకము కాలమున్న నిలచినదనుసంగతి యిదివరలోనే చెప్పియున్నాను.

చదువరి: ఇది నాకర్థముకాలేదు. ముష్టిబలముచేత ఇంగ్లీషువారిని వెడలగొట్టవలెననుట నిర్వివాదాంశముగా నున్నది. వారు దేశములో నున్నంతకాలము మనకు శాంతికలుగదు. మన కవీశ్వరులలో నొక్కడు దాసులు స్వాతంత్ర్యములను స్మరించి కలనైనకనరాదనుచున్నాడు. ఇంగ్లీషువారిచ్చట నుండుటచేత మనము దినదినము బలహీనుల మగుచున్నాము. మన ప్రతిభయంతయు పోయినది. మనప్రజనుచూచిన భయాక్రాంతులవలె కన్పించుచున్నారు. ఇంగ్లీషువారు దేశములో మహారిష్టమువలె నున్నారు. ఆ మహారిష్టము నెట్టి యుపాయములచేతను తొలగింపవలెను.

సంపా: మీఉద్రేకములో ఇంత సేపు మనముచేసినవిమర్శ యంతయు మరచిపోయినారు. మనము ఇంగ్లీషువారిని తెచ్చుకొనినాము. మనమే నిలుపుకొనుచున్నాము. వారు ఇక్కడ ఉండుటకు ముఖ్యకారణము మనమువారినాగరకమునుఅవలంబించుటయే యనునది మీరేల మరచెదరు? వారిమీద మీకుగల ద్వేషము వారి నాగరకమునెడకు మరల్చవలసి యున్నది. వాదముకొరకు యుద్ధముచేసియే ఇంగ్లీషువారిని వెళ్లగొట్టవలెనని యొప్పుకొందము. అది యెట్లు జరుగవలె?

చదువరి: ఇటలీ చేసినట్లే మనము చేయవలెను. మెజినీ గారిబాల్డీలకు సాధ్యమయినది మనకు సాధ్యము కాకపోదు. వారు మహాపురుషులు కారని మీరనబోరుగదా!

# పదునైదవ ప్రకరణము.

---

## ఇటలీ భారతభూములు.

సంపా: మీరు ఇటలీ సాదృశ్యము తెచ్చియుండుట మంచిదే. మెజనీ చాలగొప్పవాడు. మిక్కిలి మంచివాడు. గారిబాల్డి గొప్ప వీరుడు. ఇరువురుపూజ్యులు. వారి జీవితము లనేకవిషయముల మనకనుసరణీయములు. అయిన ఇటలీలో నుండిన స్థితికిని భారతభూమిస్థితికిని మిక్కిలి తారతమ్యముకలదు. మొదట మెజినీ గారిబాల్డిలకు పరస్పరము కల భేదము నాలోచించుట ఆవశ్యకము. ఇటలీనిగురించి మెజీని ఏయుద్దేశము పెట్టుకొనెనో అయుద్దేశము నేటికిని కొనసాగియుండలేదు. మానవధర్మములను గురించి అతడు వ్రాసినగ్రంథములో ప్రతిమానవుడు సామ్రాజ్యమును మొదట సంపాదింపవలయునని వ్రాసినాడు. ఇటలీలో ఇది యేర్పడ లేదు. గారిబాల్డి మెజీనిపెట్టుకొనిన ఈ దృష్టిపథము పెట్టుకొనలేదు. గారిబాల్డిఆయుధము లిచ్చెను. ప్రతియిటాలియను వానిని ధరించెను. ఆస్ట్రియ యిటలీలు జ్ఞాతులైనందున వారి నాగరక మేకమయియే యుండినది. వారు కన్నుపొడచిన వీరు కన్నుపొడచుటయే అవసరమై యుండనది. గారిబాల్డికోరినది ఆస్ట్రియాప్రభుత్వమునుండి ఇటలీ వేరుపడ

వలయుననిమాత్రమే. మంత్రికేవరు చేసినకుతంత్రములు ఇటలీకి సంబంధించిన ఆనాటిచరిత్రకు కళంకాపాదకములు. దానివలన ఫల మేమిద్దైనది. ఇటాలియనులు ఇటలీని పరిపాలించుటను జేసి ఇటలీప్రజ సుఖమందుచున్నదందు రేమి యంధకారమున బడి చూడలేకున్నారు గాని మరేమియును గాదు. మెజీని ఇటలీ స్వతంత్రము కాలేదని స్పష్టముగా చూపినాడు. ఆపదమునకు విక్టరు ఇమాన్యుల్ ఒకయర్థము చెప్పినాడు. మెజీని మరియొకయర్థమును చెప్పినాడు. ఇమాన్యుల్, కేవర్—గారిబాల్డితో సహా—ఇటలీయనిన ఇటలీరాజును అతని సహాకారులు ననిమాత్ర మాలోచించిరి. మెజీని ఇటలీయన తద్దేశప్రజ, రైతాంగమంతయు నని యాలోచించెను. ఇమాన్యుల్ నిజముగా ఆ ఇటలీకి సేవకుడు. మెజీని మానసము ననుసరించిన ఇటలీ ఇంకను దాస్యమును బాయలేదు. జాతియంతటికిని సంబంధించినయుద్ధము పొసగినప్పుడు ఇరువురు రాజుల లాభాలాభములుమాత్రమే యాలోచింపబడెను. ప్రజను చదరంగములోని కాయలవలె ఈ రాజు లుపయోగించుకొనిరి. ఇటలీలో పనివార లీనాటికిగూడ అసౌఖ్యమునబడి కొట్టుకొనుచున్నారు. కాబట్టి వారు హత్యలుకావించుట, తిరుగుబాటులు చేయుట జరుగుచున్నది. ఎప్పుడును వారు విఘ్నముకలిగింతురను భయము కలదు. ఆస్ట్రియాసైన్యములు ఇటలీ వెడలిపోయిన

తరువాత ఇటలీవారికేమి యంతగొప్పలాభము కలిగినది? ఏమి యు లేదు. వట్టినామకార్థము లాభముమాత్రము సమకూరినది. ఏసంస్కారములకొరకు యుద్ధము జరిగెనో ఆసంస్కారము లింకను ఇటలీలో అంగీకృతముకాలేదు. ప్రజల సాధారణస్థితి నాడెట్లు లుండెనో నేడును అట్లు లేయున్నది. అట్టిస్థితి ఇక్కడ కలుగజేయవలెననిమీకు నిష్టముకాదుకదా! భారతభూమి లోని కోట్లకొలది ప్రజలు సుఖమందవలయునే కాని మీచేతికి రాజ్యభారము దొరకిన చాలునని మీరాలోచింపరు కదా! నిజ మిదియే యగునేని మన మొక్క విషయ మాలోచింపవలెను. కోట్లప్రజలకు స్వరాజ్య మబ్బుటెట్లు? అనేకసంస్థానాధీశ్వరుల పాలనలో నుండుప్రజలు మిక్కిలి బాధలుపడుచున్నా రని మీరంగీకరింపవలసియుండును. కరుణ కొంచెముకూడచూపక ఆయధిపతులు ప్రజలకు కష్టములు కలిగించుచుందురు. వారి నిరంకుశత్వము బ్రిటిషువారినిరంకుశత్వమునకంటె ప్రబలతరము. ఆనిరంకుశత్వము మీకు కావలయునందురేని మనమెప్పుడును అభిప్రాయములలో నేకీభవింపజాలము. ఇంగ్లీషువారు వెడలి పోయిన స్వదేశసంస్థానాధీశ్వరులకాలిక్రిందపడి ప్రజ నలిగిపో వచ్చును అను ఏర్పాటునకు నే నెప్పుడును సమ్మతింపజాలను. అది నాదేశభక్తి కాజాలదు. దేశాభిమానమునకు నామతమున నర్థము దేశప్రజలక్షేమము, సౌఖ్యము. ఇంగ్లీషువారిమూలక

షముగా అది నమ్మునేని నేను వారికి తలవంచువాడ. ఏఇంగ్లీషు వాడైనను భారతభూమిలోని నిరంకుశత్వమును పోగొట్టి స్వాతంత్ర్యము సంపాదించుటకు తనజీవితమును ధారవోయునెడల అతనిని భారతపుత్రునివలెనే నే ప్రేమింతును.

ఇంతేకాదు. ఇటలీవలెపోరాడుట భారతభూమి ఆయుధములను ధరించినంగాని పొసగదు. మీరీవిషయము నాలోచించినట్లు కానరాదు. ఇంగ్లీషువారు చక్కగా సాయుధులై యున్నారు: దానికి నే జంకుటలేదు. కాని ఒక్కటిమాత్రము స్పష్టము. సాయుధులగువారితో పెనగవలసినచో భారతపుత్రులలో వేలకొలది ఆయుధములు ధరింపవలసియుందురు. అది జరుగవలయునని ఎన్నియేండ్లుపట్టునో ఆలోచించునది. అదిగాక భారతభూమిని విపులముగా సాయుధమొనర్చుటకు నర్థము మనము యూరోపునాగరకమున లయమగుట యగుచున్నది. అట్లైన మనస్థితియు యూరోపుస్థితివలెనే కరుణాకరము కాకమానదు. ఈపరిణామమే మనము కోరునదైన ఆనాగరకమున చక్కగా శిక్షితులైనవారు మనదేశములోనుండుట అత్యావశ్యకమగుచున్నది. అప్పుడు కొన్నికొన్నిహక్కులకై మనము పోరాడవచ్చును. కొన్ని సంపాదింపవచ్చును. కాలముగడుపవచ్చును. నిజమేమనగా భారతజాతి సాయుధముకాదు. అట్లు కాకుండుటయే మేలు.

చదువరి: మీరు విపరీతాలోచనలు చేయుచున్నారు. అందరు సాయుధులు కానక్కర లేదు. మొదట కొందరిని ఇంగ్లీషు వారినిచంపిభయోత్పాతముకలిగించినయెడల తరువాత ఏకొందరు సాయుధులైనను పనులను నెరవేర్పగలరు. రెండు రెండున్నరలక్షల జనమును మనము నష్టపడవలసియుండును. ఆ మాత్రము త్యాగముచేయగలమేని మనదేశము మనపాలగును. చిల్లరయుద్ధముతో ఇంగ్లీషువారిని జయించవలెను.

సంపా: ఈపవిత్రభూమిని మీ రపవిత్రముచేయుట మీతలంపు. హత్యలుచేసి భారతభూమిని సంరక్షించుచింత తోచినప్పుడే మీకు దేహము వడకుట లేదా ? మనకు కర్తవ్యము మనలను మనమే చంపుకొనవలెను. ఇతరులను చంపనాలోచించుట పౌరుషహీనత్వము. ఇతరులను జంపి మీరెవరికి స్వాతంత్ర్యము సంపాదింప తలచుచున్నారు. భారతజాతిలో కోటానుకోట్లు దానిం గోరరు. నేటి నవనాగరకము దిగద్రావి గ్రునత్రేపువా రిట్టియాలోచనలు చేయుదురు. హత్యచేసి పైకెక్కినవాడు జాతిని సుఖపెట్టుననుమాట కల్ల. ధింగ్రాకార్యమువలనను అట్టి యితరకార్యములవలనను హైందవభూమి లాభము పొందిన దనుకొనువారు మిక్కిలి పొరబడుచున్నారు. ధింగ్రా దేశాభిమానియే కాని అతని యభిమానము అంధప్రాయము. అతడు తప్పుదారిబడి దేహమును ధారపోసినాడు. తత్ఫలము తుదకు చెరుపేకాని వేరుకాదు.

చమకరి: అయిన ఇంగ్లీషువారు ఊహాత్ర్యలచేత భయపడినారనియు అందుచేతనే మాక్లీసంస్కరణములు ప్రసాదితములైనవనియు మీరంగీకరింతురా?

సంపా: ఇంగ్లీషువారు ధైర్యస్థైర్యములజాతి, తుపాకీముందు ఆజాతిని సులభముగా ఆలోచనకు దించునని నానమ్మకము. మాక్లేప్రభువు భయపడి సంస్కారము చేసినాడనుట నిజముకావచ్చును. అయిన భయముచే నిచ్చినది భయము వీడినతోడనే మరల పుచ్చుకొనవచ్చును.

# పదునాఱవ ప్రకరణము.

---

## పశుబలము.

చదువరి: ఇది నవీనసిద్ధాంతము. భయమునను యిచ్చినది మరల పుచ్చుకొందురా? ఒకపర్యాయము మిచ్చినది ఎవరైనను మరల్చుకొందురా.

సంపా: అటువలదు. సిపాయిల తిరుగుబాటునకు తరువాత ౧౮౫౭ సంవత్సరపు వరదానపత్రము ప్రకటితమయ్యెను. శాంతి నెలకొల్పుటకుగా నీపని జరిగినది. శాంతినెలకొని ప్రజలు చల్లబడినపిదప ఆవరదానపువన్నము తగ్గినది. నేను దొంగనను కొందము. భయము కలదని తోచినప్పుడు దొంగిలించుట మానివేయుదును. ఆభయముతొలగగా మరల నాపనిని ప్రారంభింతును. ఇది లోకస్వభావము. పశుబలము వినియోగించినచో ఏపనినైనను చేయించవచ్చునని తలంపుగొనినాము. కాబట్టి పశుబలము నుపయోగించుచున్నాము.

చదువరి: మీమాటలకు మీరే విఘాతము కలిగించుకొనుచున్నారే. ఇంగ్లీషువారు తమ దేశములో సంపాదించినది పశుబలముచేతనే సంపాదించినారు. మీరు గడించినది వ్యర్థమని

మీరు వ్రాయించుట నాకు జ్ఞాపకమున్నది కాని అవి నావాద మును విఘాతము చేయజాలవు. వారికి వ్యర్థపదార్థములపై ఆశయుండినది. వానిని గడించినారు. వారి ఆశాపూర్తియై నదనుటయే నాకవసరము. వారేమి యుపాయములు వినియో గించిన నేమిపోయె? మన యాదర్శము ఉత్తమము? దానిని చేరుటకు ఏయుపాయములైనను మనము ఉపయోగింపవచ్చును పశుబలముకూడ వినియోగార్హమే. ఇంటిలో దొంగ దూరి నప్పుడు వానిని తరుముటకు సాధనము లాలోచించుచు కూ ర్చొను వెఱ్ఱివాఁడుండునా? ఎట్లైనను అతనిని వెడలగొట్టుట కార్యము. మనవులు పెట్టుకొనుటచేత మనకేమియు ఫలము కలుగలేదనియు కలుగబోదనియు మీ రంగీకరించుట స్పష్టము. అప్పుడు పశుబల ముపయోగించి యేల ఫలమందరాదు? సం పాదించినది నిలుపుకొనుటకుకూడ అవసరమైనంతవరకు ఆ సాధనమునే ప్రయోగార్హముగా పెట్టుకొందము. శిశువు అగ్ని లో కాలుపెట్టుచుండ నిరంతరము నిర్బంధించుట సరియుండునా కాదా? ఎట్లైనను మనయుద్దేశముల సాధించుట యుత్తమము.

సంపా: మీవాదము పైచూపునకు బాగుగదోచును. ఇది యనేకుల నిదివరలో మోసపుచ్చినది. అయిన నేనితరులకంటె బాగుగా నెఱుంగుదును. కావున మీ మోహమును తీర్చుటకు ప్రయత్నింతును. ఇంగ్లీషువారు పశుబలముమూలకముగా నుద్దే

శములఁ దీర్చికొనిరి. కాన మనమును అట్లు చేయుట న్యాయ మనువాదమును మొదట నాలోచింతము. వారు పశుబల ప్రయోగముచేసి యుండుట నిశ్చయము. మనమును అట్టి సాధనమునే వినియోగింపనగుననుటయు సంభావ్యమే. కాని మనకు అట్టి సాధనముచే అట్టిఫలమే సిద్ధించుననుట। స్పష్టము. అట్టి ఫలము మనకు వలదని మీరంగీకరింతురుగదా! సాధనమునకు ఫలమునకు సంబంధములేదను మీయభిప్రాయము తప్పు. ఆతప్పుచేయుటచే దేశాభిమానులైన మహాపురుషులుకూడ మహానర్థములను లోకమున కల్పించినారు. విషబీజము నాటి సుందరమగు గులాబిపుష్పమును సృష్టింతుమని మీరు ప్రారంభించినారు. సముద్రముదాటుటకు నావయే యవసరము. బండిమీద ప్రయాణమైతిమా మనతోకూడ బండియు మునుగును. 'యథా రాజాతథా ప్రజాః' అనునది మననముచేయదగినది. దీని యర్థమెరుంగక మానవులు పలుపాట్లుపడినారు. సాధనముబీజము, ఆదర్శము వృక్షము. బీజమునకు వృక్షమునకుగల అవార్యసంబంధమే సాధనమునకు ఆదర్శమునకు గలదు. దైవభక్తివలన కలుగుఫలము శనిభక్తివలన నెప్పుడును కలుగదు. కాబట్టి ఎవ్వరైనను నేను దైవమునారాధింపవలెను. కాని శనినారాధించి దైవము నారాధించినట్లుగ కొందును' అందురేని అది అజ్ఞానమని యందరును పరిహసింతురు. పవిత్రనమునకాఫలము

తప్పను. ఇంగ్లీషువారు పశుబలము ప్రయోగించి ౧౮౩౨లో ఎక్కువ నిర్వచనాధికారము సంపాదించిరి. పశుబలప్రయోగముచే వారిధర్మము వారి కెక్కువయర్థమయ్యెనా? నిర్వచనాధికారముకోరిరి. పశుబలప్రయోగము చేసిరి. అధికారమలవడెను. అయిన నిశ్చయస్వాతంత్ర్యము ధర్మనిర్వహణమువలన కానిరాదు: ఆ స్వాతంత్ర్యమింకను వారికి కలుగలేదు. కాబట్టి ఇంగ్లండున ఇప్పుడొకనాటక మేర్పడియున్నది. ప్రతివాడును స్వాతంత్ర్యములు కోరువాడే. తనధర్మము నెఱింగినవాడు మాత్రమరుదు. ప్రతివాడు స్వాతంత్ర్యములు కోరువాడైనప్పుడెవ్వాడు ఎవ్వరికి ఇయ్యగలడు? ఇంగ్లీషువారుధర్మము నిర్వహించుటె లేదని కాదు నామతము. వారుకోరు స్వాతంత్ర్యముల కనుగుణమగు ధర్మనిర్వహణముమాత్రము మృగ్యము. అది లేకపోవుటచేత, అర్హతగడింపకపోవుటచేత, వారుగడించినస్వాతంత్ర్యములు వారికి మోయరానిభారమగుచున్నవి. అనగా వారు వినియోగించినసాధనమునకుపూర్ణముగా ననుగుణమగుఫలము వారికి కలిగినది. ఫలమున కనుగుణమగుసాధనము వారు వినియోగించిరి. మీగడియారము నే నపహరింపవలెననిన యెడల నేనుమీతోపోరవలెను, కొనవలెననిన మీకు ద్రవ్యమీయవలెను, దానమడుగవలెనన్న మిము ప్రార్థింపవలెను. ఈయుపాయములలో నే నుపయోగించునుపాయము ననుసరించి ఆగడి

యీరము దొంగసొత్తో, స్వార్జితమో, దానమో అగుచున్నది. ఈరీతిని మూఁడువిధములగుసాధనములచేత మూఁడువిధములగు ఫలము లేర్పడుచున్నవి. సాధనములతో ఫలమునకు సంబంధము లేదని ఇంకను వాదింతురా?

దొంగను పారద్రోలవలెనని మీరిచ్చిన యుదాహరణమును విమర్శింతము. ఏసాధనమైనను దొంగను పారద్రోలునని నేను నమ్మను. నాతండ్రి దొంగలించుటకు వచ్చెను. అతనిని తప్పించుకొనుట కొక యుపాయము వెదకుదును. నాకు తెలిసినవాఁడు ఆపనికి దూరె ననుకొందము. ఇంకొకవిధమగు సాధనమును వినియోగించుకొందును. ఎవ్వడో సంబంధము లేనివాడు దొంగ. అప్పటియుపాయమే వేరు. తెల్లవాడు దొంగయైన నల్లవానియెడల నుపయోగించు సాధనముకాక ఇంకొక సాధనము నుపయోగించెదరు కాబోలు మీరు. బలహీనుడు, ఒక్కకర్తె దొంగయైనయెడల సమబలునియెడల నుపయోగించు నుపాయమును వినియోగింపబోము. ఆపాదమస్తకము ఆయుధధారి యగునేని కిక్కుమిక్కుమనక యూరకుందుము. ఈవిధముగా దొంగయొక్క స్వభావము ననుసరించి అతని నివారించుమార్గములు మారుచుండును. ఇంతేకాదు. దొంగ నాతండ్రియైనను, ఆపాదమస్తకము ఆయుధములు ధరించిన ఆమోటరియైనను, నేను నిద్రించుట నభినయింతును లే, నాతండ్రికూడ సాయుధుడుగా రావచ్చును. నాకు ఇరువుర

కరుకమైనది. అతడు పారిపోయినాడు. కాని అతని మనస్సున కూడ ఉద్రేకము కల్గినది. తనసోదరచోరబృందమును చేర్చినాడు. పట్టపగటివేళ మిము దోచుకొందుమని అట్టహాసముగ సందేశము పంపినాడు. మీరు బలవంతులు. మీకు భయము లేదు. అతని నెదుర్కొనుసాహసము కలదు. ఈలోపుగ నా దొంగ మీ పరిసరవర్తుల పీడించును. వారు మీకడ మొఱ పెట్టుదురు ? మీరేమందురు. అయ్యలారా అంతయు మీకొఱకే చేయుచున్నాను. అతడు నాద్రవ్యము నపహరించినాడని నాకాగ్రహములేదు. అని ప్రత్యుత్తరమిత్తురు. మీ పరిసరవర్తులందురుగదా « వీడెప్పుడు మమ్ము హింసింపడు. మీరు వీనితో పోరాటము పెట్టికొనిన పిదపనే యీగతి తటస్థించినది.' ముందుకుపోయిన గోయి వెనుకకు తరలిన చెరువు అయినది. మీపరిసరవర్తులగు బీదలయెడ మీ కెక్కువకరుణ. వారు చెప్పునది నిజము. మీకు తెలుసును. మీరేమి చేయవలెను ? దొంగను వదలితిరా మీకు నవమానము. కాబట్టి బీదల మీరేమందురు ? « అయ్యలారా రండు. నాద్రవ్యముమీది. నేను మీకు ఆయుధముల నిచ్చెద. ఆదొంగను మీరు పట్టి తన్నుడు వదలవలదు'' ఈరీతిగా పోరాటము పెరుగును. దొంగలు సంఖ్యాతీతులగుదురు. మీపరిసరజనము అనవసరముగా అనానుకూలముల బడుదురు. ఈకారణముచేత దొంగమీద కసిదీర్చు

కొననెంచి మీశాంతికే మీరు భంగము తెచ్చికొనినారు. ఎప్పుడు దోపిడికలుగునో ఎప్పుడు శత్రువు పైబడునో అనుభయము మీకు శాశ్వతమై పోయినది. మీధైర్యము అధైర్యముగా పరిణమించినది. నావాదమంతయు జాగ్రత్తగా ఆలోచింపుడు. నేవిపరీత మేమియు వర్ణింపలేదనుట మీకె గోచరమగును. ఇది మొదటిసాధనము సంగతి. రెండవసాధనము నాలోచింతము. ఆపాదమస్తకాయుధుడైనదొంగ జ్ఞానవిహీనుడగుసోదరు డని గుర్తెరుగుదురేని సరియైన తరుణమున అతనికి సంగతులు స్పష్టపరుప నిశ్చయింతురు. ఎట్లైనను సోదరమానవుడుకదా యని జాలిగొందురు. ఎందుకతడు దొంగలింపబయలుదేరినాడో ఊహింపజొత్తురు. అంతట సమయమయినప్పు డీతనిదొంగగుణము నశింపజేతును గాక యని తీర్మానించుకొందురు. మీ రీయాలోచనలలోనుండగనే అతడు మరల దొంగలించుటకు వచ్చును. మీరు వానిని కోపపడరు. వానిపై జాలిగొందురు. ఈదొంగగుణము వానికి నంటిన రోగమని మీ రెన్నుదురు నాటినుండి మీరు తలుపులు, కిటికీలు తెరచిపెట్టుదురు. మీరు పరుండుతావు మార్చి మీసొత్తు అతనికి సులభముగా దొరకునట్లుగా పెట్టియుంతురు. మరల దొంగ వచ్చినాడు. పరిస్థితి యంతయు క్రొత్త యయినది. అతనికి విభ్రమము తోచినది. అయిన మీవస్తువులమాత్ర మెత్తుకొనిపోయినాడు. అతనిమానస మూరకయుండునా?

ఆందోళన కాకర మగును. గ్రామములో మిమ్మునుగురించి అతడు విచారణ ప్రారంభము చేయును. అందరును విశాలము ఉదారము నగుమీహృదయమును ప్రశంసింతురు. అతనికి ఖేదము తప్పదు. మీపాదముల బడినాడు. మీ మన్ననను వేడినాడు, మీవస్తువుల మీ కిడినాడు, దొంగగుణమును మానినాడు, మీసేవకు డైనాడు, గౌరవాస్పదవృత్తి నందినాడు. ఇది రెండవరీతి సాధనము. సాధనగుణమునుబట్టి ఫలగుణమును మారిన దనుట విదితము. ఇందువలన అందరు దొంగ లిట్లే నడుతు రనిగాని అందరకును మీకుగల కరుణార్ద్రహృదయమే కలుగు ననిగాని చెప్పరా లేదు. మంచి మార్గ మవలంబించిన మంచిఫలము సాధ్య మనుట కిది తార్కాణముగ చెప్పితిని. శాంతిమార్గ మనేకసందర్భముల ఫలప్రదము. ఫలప్రదము కానప్పుడు నష్టదాయకము కాదు. పశుబలప్రయోగమున నష్ట మున్నదికాని ఇందు లేదు.

అర్జీలుపెట్టుకొనుఆచార మాలోచింతము. బలాధారము లేనిఅర్జీ వ్యర్థ మనుట నిత్యము. అయినను కీర్తిశేషులైన రనడే గారు అర్జీలవలన ప్రజలవిజ్ఞాన మభివృద్ధి యగుఫల మున్నది కావున అవి ఆరీతిని ఉపయోగకరము లనిచెప్పిరి. వానివలన ప్రజలమతముయొక్క నిజస్థితి తెలియగలదు. పరిపాలకులకు హుషారు కాగలదు. ఇట్లాలోచించినయెడల ఒకవేళ అర్జీలు వ్యర్థములు కావేమో. సమానుడు పెట్టుకొను అర్జీమర్యా

దను సూచించును. దాసుడు పెట్టుకొను అర్జీ వానిదాస్యమును ప్రకటించును. బల మాధారముగాగల అర్జీ సమానునిది. అతడు అర్జీమూలకముగా స్వాతంత్ర్యముకోరుట అతని హృదయగౌరవమునకు నిదర్శనము. అర్జీల కాధారము రెండు విధము లగుబలము కావచ్చును. "ఇది ఈయవేని మేము మీకు చెరుపుచేయుదుము" అనుట యొకరీతి. పశుబలము దీని కాధారము. దీని దుష్టఫలము లిదివరకే వర్ణితములు. రెండవవిధ మిట్లు పేర్కొననగును. "మాయుద్దేశముల నెరవేర్చ రేని ఇక మీ కర్జీలు మేముపెట్టము. మేము పరిపాలితులముగా నున్నంతకాలము మీరు మమ్ము పరిపాలించగలరు. ఇకముందు మేము మీతో సంబంధము పెట్టుకొనము" ఇందు కాధార మగుబలము ప్రేమబల మనవచ్చును. ఆత్మబల మనవచ్చును. లేదా సామాన్యముగా వ్యవహరింపబడురీతిని సాత్త్వికనిరోధ మనవచ్చును. ఇది అంత సరియైనపదము కాదు. ఈబలముమాత్రము నశ్వరము. దీనిని పూర్ణముగా ప్రయోగింపగలవాడు తనస్థితి కెప్పుడును వగవడు. ప్రాతలోకోక్తి యొక్కటికలదు. దానియర్థ మిది. ఒక్కనహి ముప్పదిమూడు రోగముల కుదుర్చును. ఈ క్షేమ బలమునకు అథవా ఆత్మబలమునకు ఎదురుపడినప్పుడు పశుబలము వ్యర్థము. మీరు కడపటనిచ్చిన యుదాహరణమును విమర్శింతము. అదెద్ది? శిశువు అగ్నిలో కాలిడుట మాన్పు టెట్లు అనునది. మీరు

చెప్పినయుపాయము నిజముగా పనికిరాదు. శిశువును మీ రేమిచేయుచున్నారో ఆలోచింపుడు. మిమ్మును కాదని తన పశుబలముచే శిశువు అగ్ని నురకగలదేని మీ యుపాయ మాపదను వారింపదు. అప్పుడు మీకు రెండుపాయములు నిలువయుండును. అది యగ్ని నురుకకుండుటకు మీరు దానిని చంపనైన చంపవలెను లేదా చూచుట కోర్వలేక మీరైనను చావవలెను. దానిని మీరుచంపరు. మీహృదయము అంత కరుణార్ద్రము కాదేని శిశువునకు ముందుగా మీ రగ్ని నురికి నశింపరు. మీ రేమిచేయుదురు? చేతగాని శిశువు నగ్ని నురుకనిత్తురు. ఇట్లు మీరు పశుబలము నుపయోగించుట మానివైతురు. మీచేతనైనచో శిశువును అగ్ని నురకకుండ నిర్బంధింతురే అదియు పశుబలమే. అయిన క్రింది దర్జాకు చేరినది, అని మీ రందురేమో, అదికాదు దాని స్వభావము వేరు. మన మింకను నరయవలసియున్నాము.

ఆరీతిని మీరు శిశువును నిర్బంధించుటలో మీరు దాని లాభమునుమాత్ర మాలోచించుచున్నారు. దాని మేలునకై మాత్రమే మీరు అధికారము చేయుచున్నారు. ఇది మరువ రాదు. మీ నిదర్శనము ఇంగ్లీషువారికి సమన్వయము కాజాలదు. ఇంగ్లీషువారిపై పశుబలప్రయోగము చేయునప్పుడు మీ రాలోచించునది మీ మేలుమాత్రమే, మీజాతియొక్క లాభముమాత్రమే. ఇందులో దయకుగాని ప్రేమకుగాని

తాన్రులేదు. ఇంగ్లీషువారు చేయుపని చెడ్డది. అందువలన అది అగ్ని. ఇంగ్లీషువారు శిశుపదమున నున్నారు, నేనాశిశువును సంరక్షింతును, ఆ సంరక్షణకై నాదేహ మర్పింతును అందు రేని అది ఇంగ్లీషువారియెడలమాత్ర మనుట గాదు. తప్పు చేయు ప్రతివారియెడల అట్లే చేయుదు ననుట యగును. అంత దయార్ద్రహృదయము మీదియగునేని మీకు శుభం బగుగాక.



## పదునేడవ ప్రకరణము.

---

### సాత్త్విక నిరోధము.

చదువరి: మీరు ఆత్మబలము, ప్రేమబల మంటిరే అది యెచ్చటనైనను విజయమందినట్లు చారిత్రకనిదర్శనము లున్నవా? ఏజాతియు ఆత్మబలముచే అభివృద్ధియైన ట్లెచ్చటను చెప్పబడలేదు. పశుబలశిక్ష లేక దుర్మార్గులు దుర్మార్గమును వదల రని నా కింకను నమ్మకమే.

సంపా: కవి తులసీదా సిట్లనుచున్నాడు. "దేహమునకు అహంకారము బీజ మయినట్లు మతమునకు దయాప్రేమలు బీజములు. కాబట్టి మన మెప్పుడును దయను వీడరాదు." ఇది స్వశాస్త్రీయము. రెండునురెండు నాలుగను టెంతసంపూర్ణ సత్యమో ఇదియు నంత సంపూర్ణ సత్య మని నానమ్మిక. ప్రేమ యొక్కశక్తి ఆత్మశక్తి, సత్యశక్తితో నైక్యము. నిమేషనిమేషము దాని ప్రభావము మనకు దృష్టము. ఆశక్తియే లేనిచో ఈప్రపంచమే యుండదు. మీరు చారిత్రకనిదర్శనము కావలయు ననుచున్నారు. కాబట్టి చరిత్రయనగా నేమో యెరుంగుట యవసరము. గుజరాతిభాషలో చరిత్రకుగల పర్యాయ పదము "ఇతిహాస్" "ఇది ఇట్లునడచినది". చరిత్రకు అర్థము ఇదే యగునేని జరిగినసంగతు లెన్నియో చెప్పవచ్చును.

కాని చరిత్ర మనగా రాజులయు సార్వభౌములయు కార్యాకార్యములే యనుచో అచ్చట ఆత్మశక్తి సాత్త్వికనిరోధముల కార్యపరత్వ మేమూలను కానరాదు. గాజులగనిలో వజ్రము వెదుకరాదు. చరిత్ర యనగా నేడు యుద్ధములచరిత్ర. అందుచేతనే ఇంగ్లీషులో నొకజనోక్తి యేర్పడినది. చరిత్రలేని దేశము, అనగా యుద్ధములులేని దేశ మని యర్థము, క్షేమదేశము! రాజు లెట్లాడినది వా రొండొరులతో నెట్లు వైరపడినది, వా రొక్కరినొక్కరు ఎట్లు హతముచేసికొనినది చరిత్రలో చక్కగా వర్ణితమయి యున్నది. నిజముగా ఇదియే లోకములో జరుగుపని యైనయెడల లోక మెన్నడో అంతమై యుండును. ప్రపంచకథ యుద్ధములతో ప్రారంభ మగునేని నేటికి ఒక్కమనుష్యు డైనను సజీవుడై యుండడు. ఎవ్వరిమీద యుద్ధములు జరిగినవో వారు విశేషముగా నశింపు నందినారు, ఉదాహరణార్థము ఆస్ట్రేలియా ఆదిమనివాసుల నాలోచింపుడు. బయటివారి దాడికి వా రందరు రూపులేక చనినారు. ఒక్కటి జ్ఞాపక ముంచుకొనుడు. ఆ యాదిమనివాసులు ఆత్మశక్తిని వినియోగించలేదు. తద్వినియోగము చేయని ఆస్ట్రేలియనులుకూడ ఒక్కనాటికి ఆగతియే పట్టవలసి యుందురు. నీట నీదువానికి నీటిగండము తప్ప దనునట్లు కత్తిపట్టువానికి కత్తిగండము తప్పదు.

లోకములో ఇంకను ఇందరు ప్రజలు బ్రతికియున్నారుగదా! ఇది యేమిసూచించుచున్నది? లోకనిర్మాణము కత్తులమీద పశుబలముమీద ఆధారపడి యుండలేదు. ప్రేమ సత్యముల మీద ఆధారపడి యున్నది. అందుచేత ఆత్మశక్తియొక్క ఫలమునకు వేరువాదమే అక్కరలేదు. ఇన్నియుద్ధములు జరిగినను లోకము నిలిచియుండుటే ఆత్మశక్తికి ప్రేమశక్తికి ప్రబల తార్కాణము. వేనవేలు కోటానుకోటులు జీవించుట ఈ శక్తి ఆధారముగానే జరుగుచున్నది. లక్షలకొలది కుటుంబములలో అహారహము జనించు చిన్నచిన్న పోట్లాట లన్నియును ఈశక్తిమూలకముగనే నిమేషనిమేషమును తీర్మానమగుచున్నవి. నూర్లకొలదిజాతులు శాంతముగా బ్రతుకుచున్నవి. చరిత్రము ఈవిషయము గమనించలేదు. గమనించజాలదు. ఈప్రేమశక్తి ఆత్మశక్తుల ప్రచారమును నాటంకపరచునట్టి సంగతులే చరిత్రనామమున బరగుచున్నవి. ఇరువురుసోదరులకు విభేదము కలిగినది. ఒక్కడు తనతప్పునెరింగి రెండవవానిదయను ప్రేరేపించు చున్నాడు, ప్రేమను ప్రేరేపించు చున్నాడు. ఇరువురకు శాంతికుదిరి కాలము గడుపుచున్నారు. దీని నెవ్వరును వ్రాసియుంచుట లేదు. కాని వీరిరువురు, వకీలు అడ్డపడుటచేతనో మరి యేకారణముననో, ముష్టియుద్ధమునకు దిగినప్పుడు తత్తుల్య మగు న్యాయవిచారణకు కడంగినప్పుడు వీరివిషయము రచ్చ కెక్కు

చున్నది. పత్రికలలో ప్రకటిత మగుచున్నది. ఇరుగుపొరుగు వారి సంభాషణకు పాత్ర మగుచున్నది. చరిత్రలో భాగము కూడ కావచ్చును. కుటుంబములు తెగలసంగతి యెంతో జాతులసంగతియు నంతే. కుటుంబముల కొకస్వభావము జాతుల కొకస్వభావము కలుగు నని వేరుచేయుటకు కారణము కానరాదు. కాబట్టి చరిత్ర మనునది స్వభావస్థితికి కలిగిన విఘాతములకథగాని వేరుగాదు. ఆత్మశక్తి సహజస్థితి కావున చరిత్రకు నెక్కినది కాదు.

చదువరి: మీరు చెప్పునదిచూడగా సాత్త్వికనిరోధము నకు సంబంధించిన యుదాహరణములు చరిత్రమున లేవనుట స్పష్ట మగుచున్నది. కాబట్టి ఈ సాత్త్వికనిరోధ మనగా నేమో ఇంక కొంచెము విపులముగా నెరుగుట అవసరము. దయచేసి విశదీకరింపుడు.

సంపా: సాత్త్వికనిరోధ మనగా మనవలె స్వకాయమును కష్టపెట్టుటచే స్వాతంత్ర్యముల సంపాదించుటయే. ఆయుధ ధారణోపాయమున కిది ప్రత్యక్షవిరోధి. నామనస్సాక్షికి సమ్మతము కానిపనిని నేను చేయనిష్టపడక నిలుచుట ఆత్మ బలమును వినియోగించుట. ముష్టిబలపద్ధతుల నుపయోగించి ప్రభుత్వము వారిచే నాకు సమ్మతముకాని శాసనమును రద్దు చేయింతునేని అది దేహబలోపాయ మగును. శాసనమునకు

నేను లోబడనని తెలిపి అది విధించుశిక్షల ననుభవింతునేని అది ఆత్మబలోపాయ మగును. దీనికి ఆత్మత్యాగ మవసరము.

అందరును ఇతరులను బాధపెట్టుటకన్న ఆత్మత్యాగము మహోత్తర మని యంగీకరించుచున్నారు. అంతేకాక న్యాయముకాని విషయములలో ఈశక్తి నుపయోగించినను ఉపయోగించువాఁ డొక్కరుడే నష్టపడును. అతనితప్పువలన ఇతరులను బాధపెట్టినవాడు కాడు. ఇదివరలో మానవు లెన్ని యోపనులు చేసినారు. అందులో ననేకములు తప్పనుట తరువాత బయల్పడినది. ఏమానవుడును సంపూర్ణత్వమును ఆరోపించుకొనరాదు. ఎప్పుడును తనయభిప్రాయమే సంపూర్ణముగా ననుకరణీయ మనరాదు. ఎవ్వడును ఇదితప్పు ఇది నిజ మని అచలసిద్ధాంతము చేయరాదు. తనయాలోచనకు తప్పనితోచినది తనమట్టుకు తప్పే, సందియములేదు. అందుచేతనే తనకు దోష మని తోచినది యెవ్వడును చేయరాదు. అందువలన కలుగుఫలము ఎట్టిదైనను అనుభవింపవలసినది. ఇదియే యాత్మశక్తికి మూలాధారము.

చదువరి: అట్లైన మీరు శాసనముల నుల్లంఘింతురా? అది రాజభక్తికి మహావ్యతిరేకము. మన మెల్లకాలము న్యాయబద్ధుల మనుకీర్తి గడించినాము. మీరు అతివాదులను మించిపోవున ట్లున్నారు. వారు చెప్పున దేమి? ఎట్టిశాసనముల కును మనము బద్ధులము గావలెను. అవి చెడ్డవియైనవి యగు

నేని వానికర్తలను బలాత్కారముగా నైననుసరే తరిమివేయ వలెను.

సంపా: నేను అతివాదుల మించెదనో లేదో దానితో మన కవసరములేదు. ఏది రుజుపథమో కనిపెట్టుట మన ధర్మము. తదనుగుణముగా నడుచుకొనుట మనకు కర్తవ్యము. మనము న్యాయబద్ధుల మనుట కర్థము మనము సాత్త్వీకనిరోధుల మనియే. ఏదేనిశాసనము మన కరిష్టమగుచో శాసన కర్తల నెత్తులు బ్రద్దలుకొట్టువారముకాము. మనము దానిని తిరస్కరించి అందువలన కలుగుకష్టముల ననుభవింతుము. శాసనము శిష్టమైనను దుష్టమైనను లోబడవలయు ననుట క్రొత్తసిద్ధాంతము. పూర్వ మిట్టిఆలోచనయే యుండలేదు. ఏశాసనములు తమ కసమ్మతములో వానిని తిరస్కరించి ప్రజలు తత్ఫలము ననుభవింతురు. మనస్సాక్షికి విరోధ మగుశాసనములకు లోబడుట పౌరుషవ్యతిరేకము. మతమునకు విరోధము. దాస్యమునకు బునాది. ప్రభుత్వమువారు నగ్నులై తిరుగవలసిన దందు రనుకొందము. మన మట్లు కావింపవలసినదేనా. నేను సాత్త్వీకవిరోధినేని వెంటనే అయ్యలారా, మీ యీశాసనము నా కన్వయింపజాల దని వారికి తెలియపరతును. మనము మనయాత్మలను మరచిపోయినాము. అడుగుల కెరగుట మన కభ్యాసమై పోయినది. కావున ఎంతటి నీచశాసనము నైనను శిరసావహించుట కేవగింపకున్నారము.

ఎవ్వఁడు పౌరుషవంతుఁడో, ఎవ్వని కాయీశ్వరునిభయము దక్క వేరుభయములేదో వాఁడు ఇతరులకు జంకఁడు. మానవ నిర్మితశాసనములు వానిని బంధింపవు. ప్రభుత్వమువారుకూడ ఇట్లు బంధితులు కావలెనని మిమ్మును గోరరు. వారు మీ రిట్లుచేయునది యని యెప్పుడును చెప్పుటలేదు. ఇట్లు చేయ రేని ఈరీతిని దండింతుమందురు. శాసనములో వ్రాసినది వేద మనియు లోబడుటే ధర్మ మనియు అనుకొనునంతటి అధోగతి మనకు సంభవించినది. అన్యాయశాసనమునకు లోనగుట పౌరుషవిహీనత్వ మనుటను మానవు డెఱుంగునేని అన్యు డెంత నిరంకుశాధికారి యయినను ఇతని కాతడు బానిసీ డెన్నడును కాఁడు. స్వరాజ్యమునకయి యెఱుంగదగిన పరమరహస్యం బిదియే.

అనేకు లేదిచేసిన నది స్వల్పసంఖ్యాకులను బంధింపవలె ననుట అంధపరంపరత్వము, ఆధ్యాత్మికవ్యతిరేకము. అనే కుల అపభ్రంశము కొందర వివేకము — వీనికి సంబంధించిన తార్కాణము లెన్నియైన చూపవచ్చును. ఎల్లసంస్కార ములు అనేకులను సంస్కరించుటను కొందరు ప్రారంభించు నట్టివే గదా! దోపిడిగాండ్రగుంపులో దోపిడికి కావలసిన శిక్షణ మవసర మని యభిప్రాయము. అందులో నొకశిష్టుడు జన్మించినాడు. వా డీసిద్ధాంతము నంగీకరింపవలెనా? అన్యా యశాసనముల నైనను అనుకరింపవలె ననుసిద్ధాంత మెంత

కాలముండునో అంతకాలను మానవులకు దాస్యము తప్పదు. సాత్త్విక నిరోధియే యీసిద్ధాంతమును త్రుంచగలడు.

పశుబలోపయోగము సాత్త్వికనిరోధ సిద్ధాంతమునకు వ్యతిరేకము. ఏలయందురా! మనము కోరునది, శత్రువు కోరనిది అతనిచేత బలాత్కారముగా చేయించువార మగుదుము. అట్టి బలాత్కారము న్యాయమైనయెడల అతడు మనయెడల అదేరీతిని ప్రవర్తించుట న్యాయమే యగును. కాబట్టి సమాధాన మెన్నడును కుదురబోదు. గుడ్డిగుర్రము గానుగ చుట్టు తిరుగుచు "ముందుకు బోవుచున్నాను" అనుకొనుపగిది మనమును కుమ్మరిసారెవలె తిరుగుచు అభివృద్ధి నందుచున్నామని పిచ్చిసంతసమును పొందవచ్చును. తమ మనస్సాక్షికి సమ్మతముకాని శాసనములను అనంగీకారార్హము లని యనుకొనువారికి సాత్త్వికనిరోధ మొక్కటియే సాధనము. మరియన్నియు అరిష్టకారణములు.

చదువరి: మీరు చెప్పుదానినిబట్టి యాలోచింపగా బలహీనులకు సాత్త్వికనిరోధము పరమాయుధ మనియు బలవంతులు యుద్ధసన్నద్ధులు కావచ్చు ననియు తోచుచున్నది.

సంపా: ఇది వట్టియజ్ఞానము. సాత్త్వికనిరోధము అనునదియే ఆత్మశక్తి, అజయ్యము. అట్టియెడ దానిని బలహీనులసాధనం బనిమాత్ర మెట్లాడవచ్చును? పశుబలసిద్ధాంతమును వా

దించువారలలో ధైర్యము తక్కువ. సాత్త్వికనిరోధియందది యెక్కువ, అపారము. తన కనిష్ట మగుశాసనమును పిరికివా డెప్పుడైనను తృణీకరింపగలుగునా? అతివాదులు పశుబల పక్షపాతు లందురు. వా రేల శాసనబద్ధతను మాటిమాటికి ప్రకటించుచుందురు? వారిని నే నిందించుట కాదుకాని వా రింకొకరీతిగా మాటలాడుటకే రాదు. ఇంగ్లీషువారిని వెడల గొట్టి, తాము పరిపాలకు లైనప్పుడు, వారు నన్ను మిమ్మును వారిశాసనములకు దాసులు కావలసిన దని కోరగలరు. వారి రాజ్యాంగాభిప్రాయమున కది తగినదియే. ఫిరంగి యెదుట బెట్టి ప్రాణములుతీసినను సరియే తన కనిష్ట మైనశాసనమును తా నంగీకరించుట లే దని సాత్త్వికనిరోధి నిలువంబడగలడు.

మీ యభిప్రాయ మేమి? ఎవ్వడు ధైర్యముకలవాడు? ఫిరంగివెనుక దాగికొని ఇతరులపై గుండ్లువేల్చి చంపునట్టి వాడా? హాసన్ముఖముతో ఫిరంగినుండి వెలువడుగోళము నెదుర్కొని ప్రాణము లర్పించువాడా? ఎవ్వడు వీరుడు? కా లుని పరమమిత్రునిగా భావించువాడా? ఇతరులప్రాణముల తనవశము చేసికొనువాడా? పౌరుషము ధైర్యములేనివా డెవ్వడును సాత్త్వికనిరోధి యెప్పటికిని కాజాలడు. దేహబల మెక్కువగా లేనివాడుకూడ సాత్త్వికనిరోధి కావచ్చును. ఇది నా కంగీకారమే. ఒంటరిపై యీ నిరోధము నెరపవచ్చును. కోట్లతోగూడియు నెరపవచ్చును. పురుషులు స్త్రీలు అను

విభేదము నించు లేదు. ఇందులకు సైనికశిక్షణ మక్కరలేదు. జియుజిట్సు అక్కరలేదు. మనమును నిగ్రహించుశక్తిమాత్ర మవసరము. అది కలిగెనేని మానవుడు పురుషసింహ మగును. అతని చూపుమాత్రన శత్రువు భయకంపితుడు కావలసి యుండును.

సాత్త్వీకనిరోధము అనేకధారాయుత ఖడ్గము. ఎట్లు కావలసిన నట్లు దానిని త్రిప్పనగును. ఎవ్వ డుపయోగించునో వానిని, ఎవ్వనిపై ఉపయోగింపబడునో వానిని, ఇరువురనుగూడ నీఖడ్గము పవిత్రముచేయును. ఒక్కబిందువు రుధిరము చిందింపక యీయాయుధము మహత్తమఫలములను సంపాదించును. సాత్త్వీకనిరోధులలో పోటీ వైచికొనినను పరాజయ మందువా రుండరు. సాత్త్వీకనిరోధఖడ్గమునకు వరయు నక్కరలేదు. ఇట్టి మహాయుధమును బలహీనులయాయుధ మని మీరు వర్ణించుట చిత్రముగానేయున్నది.

చదువరి: సాత్త్వీకనిరోధము భారతభూమికి ప్రత్యేకసాధన మంటిరి. ఈదేశమున ఫిరంగు లెప్పుడును ఉపయోగించలేదా ?

సంపా: మీయభిప్రాయమున భారతభూమియనిన నిచ్చటి కొన్ని రాజవంశములనుటగా నున్నది. ఏకోటానుకోటి ప్రజపై ఆరాజవంశములును మనమును ఆధారపడియున్నామో ఆకోటానుకోటిప్రజయే నామానసమున భారతభూమి.

రాజులు ఎప్పుడును రాజసాయుధములను వినియోగింతురు. పశుబలదీక్ష వారికి పట్టినది. వారు అధికారమొనర్ప నాలోచింతురు. అయిన అధికారమును శిరసా వహించువారలకు ఫిరంగు లక్కఱలేదు. ఈ రెండవతెగవారే లోకమున మహత్సంఖ్యాకులు. వీరు దేహబలమో ఆత్మబలమో అభివృద్ధి చేయవలసియుందురు. దేహబల మభివృద్ధిచేయుచోట పరిపాలితులు పరిపాలకులు అందరు మతిభ్రష్టు లగుదురు. ఆత్మబల మభివృద్ధి చేయుచోట రాజులయాజ్ఞలు వారికత్తి మొనలదాటి వ్యాపింపవు. ఏలయన, నిజపౌరులు అన్యాయాజ్ఞల నుల్లంఘింతురు. రైతుల నే ఖడ్గమును లోబరచుకొని యెరుగదు. ఇకముందును లోబరుచుకొన జాలదు. వారికి ఖడ్గ ముపయోగించుట తెలియదు. ఇతరు లుపయోగించిన వారికి భయము లేదు. జాతస్యమృత్యుం ధృవ మ్మని కాలుని తలగడగా నిడి ఏజాతి ప్రవర్తించునో అది యుత్తమజాతి. కాలుని గణింపని నాడు భయమునకు తావే లేదు. పశుబలముయొక్క పంచరంగులను పవిత్రముగా నెంచి మోహితులైనవారి కీవర్ణన మననార్హము. నిజ మేమన. భారతభూమిలో జీవితశాఖల నన్నింటను ప్రజ సాత్త్వికనిరోధము నవలంబించియే యున్నది. పరిపాలకులు మన కనిష్ట మగుకార్యములను చేసినప్పుడు మనము వారితోకలసి పనిచేయుటలేదు. ఇదియే సాత్త్విక నిరోధము.

చిన్న సంస్థాన మొకటి కలదు. దాని యధిపతి యొకయాజ్ఞ పాలించెను. అది ప్రజలకు సమ్మతము కాలేదు. వారు వెంటనే గ్రామమువదలి వలసపో నారంభించిరి. అధిపతి కధైర్యము పుట్టెను. ప్రజలక్షమాపణను ఆతడు ప్రార్థించెను. తనయాజ్ఞ నుపసంహరించుకొనెను. ఇది నాజ్ఞాపకమున జరిగినసంగతి. ఇట్టి ఉదాహరణములు భారతచరిత్రమున నెన్నియైనను కలవు. సాత్త్వికనిరోధము ప్రజలకు మహామంత్రముగా ఏర్పడినచోటనే నిజ మగు స్వరాజ్యము సాధ్యము. మరి యేసందర్భము పొసంగినను అది పరిపాలనయే కాని స్వరాజ్యము కాదు

చదువరి: అట్లైన కాయమును పోషించి శిక్షించుటయే యనవసరమా యేమి?

సంపా: అట్టిది నేనేమియు చెప్పలేదు. కాయము శిక్షితమైనగాని సాత్త్వికనిరోధి యగుటకు వీలులేదు. బాల్యముచే జీలుపడినదేహము నాశ్రయించుమానసము బలవంతము కాజాలదు. మనోదౌర్బల్యము ఆత్మదౌర్బల్యమునకు కారణము. కాబట్టి బాల్యవివాహముల మానుటచేతను విషయలౌల్యమును వీడుటచేతను దేహపటుత్వము సంపాదింపవలసియుండును. ఒక్కొకట్లైను ఫిరంగిగుండున కెర కమ్మని నేప్రోత్సహింతునేని లోకమంతయు నను నవ్వుదురు.

చదువరి: మీమతానుసారము సత్యాగ్రహియగుట సుసాధ్యము కాదు. అందు కేమార్గ మవలంబనీయమో దయచేసి చెప్పునది.

సంపా: సత్యాగ్రహి యగుట సులభమే. మిక్కిలి కష్టంబును నగు. పదునాలుగేండ్ల పసిబాలుడు సత్యాగ్రహియగుట నే నెఱుంగుదు; అదేరీతిని రోగపీడితులును నైనారు; బలిష్ఠులును సుఖులును నైనవా రనేకులు కాలేకపోయిరి. అనుభవముమీద నా కొక్కటి స్పష్టపడినది. దేశసేవకై సత్యాగ్రహ మవలంబించువారు బ్రహ్మచర్యవ్రతనిష్ఠులై, దారిద్ర్యవ్రతగరిష్ఠులై, సత్యదీక్షాప్రవర్తకులై, నిర్భయగుణభరితులు కావలెను. బ్రహ్మచర్యము, వ్రతనిష్ఠ, లేక మానసమునకు అవసరదార్ఢ్యము కలుగదు. విషయలోలుడు పతితుడై పౌరుషవిహీనుడై ధైర్యదూరు డగును. మహాప్రయత్నమున కనర్హుం డగును. అనేకోదాహరణములచే దీనిని దృఢపరుపవచ్చును. అయిన వివాహితు డేమిచేయవలె నను ప్రశ్న తోచకపోదు. అది తోచవలసిన యవశ్యము లేదు. భార్యాభర్తలు తమమోహముల దీర్చుకొనునప్పుడు అది పశుప్రాయము కాకపోదు. సంతానవృద్ధికి దక్క ఈ సౌఖ్యము నిషేధము. సత్యాగ్రహి ఈ కొద్దిపాటి యనుభోగమునుగూడ జింపవలసి యుండును. అతడు సంతానాభివృద్ధినిగూడ కోరడు. కాబట్టి వివాహితు డైనవాడును బ్రహ్మచారిగ నుండనగు

ఈవిషయము దీర్ఘతరముగ విమర్శింపరాదు. ఇం దెన్ని యో పిల్లప్రశ్నలుపుట్టక తప్పదు. భార్య నేమిచేయవలెను? వెంట మోసికొని పోవచ్చునా? ఆమెకు గలహక్కు లేవి? ఇత్యాదులు. మహాత్కార్యనిమగ్ను లీవిషయములకు సమాధానము నిశ్చయించుకొనవలసి యుందురు.

బ్రహ్మచర్యమున కవసర మున్నయట్టులే దారిద్ర్యదీక్షకును అవసర మున్నది. ద్రవ్యాకాంక్ష సత్యాగ్రహము రెంటు నేకస్థలమున నుండజాలవు. ద్రవ్యము కలవారు పారవేయవలయు నని కాదు ఇందు కర్థము. దానినిగురించి వారు ఉదాసీనులై యుండవలెను. తుది దమ్మిడీవరకు పోయినను సిద్ధపడవలసినదే కాని సత్యాగ్రహముమాత్రము వీడరాదు.

మనవివరణములో సత్యాగ్రహము సత్యశక్తి యని నాము. అందుచేత సత్య మనుకరణీయము. ఎంతటినష్టము కలిగినను సత్యము వీడరానిది. ప్రాణనష్టము కలుగ నున్నప్పుడు మొదలైనవేళల ననృత మాడరాదా యను మున్నగుప్రశ్నలిచ్చుట పొడగట్టును కాని అనృతమును సూనృతము చేయ దలచువారే యీవిమర్శకు దిగుదురు. ఎల్లప్పుడు సూనృతము పాటింప నెంచువారల కిట్టిస్థితులు సంప్రాప్తమే కావు. అయినను, వారికి అసంబద్ధకార్యములు తటస్థించవు.

నిర్భయమానసము లేనిది సత్యాగ్రహి యొక్కయడుగైనను, పెట్టజాలదు. ఆస్తి యని, గౌరవ మని, బందుగు లని, పరి

పాలగు లని, అపాయము లని, మృత్యు వని భయ మందువారికి సత్యాగ్రహము నహి.

కష్టసాధ్య మని సత్యాగ్రహము వీడరాదు. ఎంతటికష్టము వచ్చినను మనము చేసికొనినది కానిచో భరించు మహత్తమ శక్తిని దైవము మనకు ప్రసాదించినాడు. దేశసేవయే పరమావధిగా లేకున్నను ఈ సత్యాగ్రహగుణ మలవడచేసికొనుట యావశ్యకము. ఆయుధధారులు కా నెంచువారు కూడ సత్యాగ్రహగుణములు సంపాదించియే కావలెను. ఆలోచనమాత్రన ఆగర్భశూరు డెవ్వడునుకాడు. వీరుడు కా దలచువాడు బ్రహ్మచర్యము ననుష్ఠింపక దప్పదు. దారిద్ర్యవ్రతము నంగీకరింపక తీరదు. నిర్భయవిరహితు డగువీరుడు గగనకుసుమమువంటివాడు. అతడు సత్యవాదియే కావలయుననునిశ్చయము లేదందు రేమో. ఎప్పుడు నిర్భయమానసుడో అప్పుడు మానవుడు రుజుప్రవర్తకు డగును. ఏదోయొకరూపమున భయ మావేశించిననేకాని మానవుడు సత్యమును వదలడు. పై చెప్పిన నాలుగుగుణములసంపాదన మందుచేత నెల్లరకు అవశ్యకర్తవ్యము. ఎవ్వరును తత్పథమునకు వెరవ నవశ్యము లేదు. పశుబలపక్షపాతికి ఈ గుణములతో డంగూడ ఇంక నెన్నియో వ్యర్థగుణము లవసర మగును. సత్యాగ్రహి వానిం గోరడు. అంతియగాదు. ఖడ్గధారి అవలంబించు ఇతర గుణము లన్నియు పాశవికభీతి యుండుటచేతనే ఆవశ్యకము

లగుచున్న దనుటయు స్పష్టమే. ఎప్పుడు భయమువీడునో అప్పుడు ఖడ్గ మాతనిచేతిని వదలిపోవును. దానిసహాయ మతనికి ననావశ్యము. వైరకల్మషము లేనివానికి ఖడ్గముతో పనిలేదు. ఒకానొకమనుష్యుడు దారినడచుచున్నాడు. అతని చేత కత్తి యున్నది. ఆకస్మికముగా సింహ మెదురుపడినది. నిరాలోచనమై ఆత్మసంరక్షణకై కత్తి నెత్తినాడు. అనిమేష మున నే యొకభావ మాతని మనోవీథిని తోచినది. ధైర్యము లేకున్నను ధైర్య మున్నట్లు దంభముఁలాడుకొని యుండుట స్మరణకు వచ్చినది. వెంటనే అతడు కత్తిను క్రింద పడవైచి నాడు. భయము పారిపోయినది.



# పదునెనిమిదవ ప్రకరణము.



## విద్య.

చదువరి: ఇంత మాట్లాడితిమి. ముఖ్యమైనది విద్య. దాని సంగతి రాలేదు. బడోదా గైక్వాడుమహారాజు నిర్బంధోచిత ప్రారంభవిద్య పెట్టినాడు. మే మంద రాతనిని పూజించుచు న్నాము. ఇదంతయు వ్యర్థమేనా.

సంపా: మహారాజు ఉత్తమోద్దేశమువాడు. కాని ఈ విద్యవలన ఫలముమాత్ర ముండదు.

విద్యయనగా అక్షరజ్ఞాన మగునేని అది యొకసాధనము. దానిని సద్వినియోగము చేయవచ్చును. దుర్వినియోగమును చేయవచ్చును. దుర్వినియోగము నే డెక్కువగనున్నది. కావున ఎక్కువగా నష్టముకలిగిన దనియే చెప్పతగియున్నది.

పిల్లలకు చదువు, వ్రాత, లెక్కలు నేర్పిన, అది విద్య యనుకొనుచున్నాము. రైతు కష్టపడి న్యాయముగా జీవనము చేయుచున్నాడు. సామాన్యలోకవ్యవహార మతనికి తెలుసును. అయిన అక్షరములువ్రాయుటమాత్ర మతనికి రాదు. అక్షరములు నేర్పి అతనికి ఎక్కువ మారేమి కలుగ జేయుచున్నారు. ఆతనిసౌఖ్యమున కొక్కలవము పెంపు గల్గింపగలరా? అనవసరాసంతుష్టిని పెంపొందించుటయే

గదా! దానికిగూడ నిప్పటివిద్య వలంతికాదు. పాశ్చాత్య నాగరికమోహాముచే మన మీవిద్యను పట్టుకొని పెనగు చున్నాము.

ఉత్తమవిద్య యనునదియు మిథ్యయే. నేను భూగోళశాస్త్రము, ఖగోళశాస్త్రము, గణితశాస్త్రము, బీజగణితము, రేఖాగణితము అన్నియు నేర్చితిని. వీనిని నేనేమి యుపయోగించినాను? అవి యెందుకు పనికివచ్చినవి? హాక్స్లీ పండితుడు విద్య నిట్లు వర్ణించినాడు. సంకల్పమున కనుగుణముగ సంతసమున సేవయొనర్చు శరీర మలవడునట్లు ఏవాడు బాల్యమున శిక్షనందినవాడో ఎవ్వనిబుద్ధి కుశాగ్రమయి శాంతమయి తేటయయి ప్రకాశించునో ఎవ్వనిమానసము స్వభావసిద్ధసూత్రముల గ్రహించినదో ఎవ్వనియింద్రియములు సుశిక్షితములైన మనస్సాక్షికి నిరంతర మడకువతో ప్రవర్తించునో ఎవ్వడు ఎల్లనైచ్యమును నిరసించి ఇతరునింగూడ తన్నుబోలె గారవించునో వాడే విద్యావంతుడు.

ఇట్టివిద్య మన ప్రాథమికవిద్యాపద్ధతిలోను కానము. ఉత్తమవిద్యలోను కానము.

చదువరి: మీయుత్తమవిద్య మీకు ఫలమునియ్యనిచో నింతదూరము మీరు నాకు విమర్శించి చెప్పియుండజాలరు.

సంపా: నాకు ప్రాథమికవిద్యగాని ఉత్తమవిద్యకాని మా పెద్దలు నేర్పనియెడల నాజీవనము చెడిపోయి యుండజాలదు.

ఆడినంతమాత్రన కార్యము సాధించుట కాదు. ఈమాట లై
నను మీకు చెప్పగలనే కాని దేశములోని కోట్లసంఖ్యాక మగు
సోదరబృందమునకు చెప్పలేను. మన విద్యాపద్ధతిని ఖండిం
చుటకు ఇదియే చాలును. దానిలోపములనుండి వీడ్వడినా
నని నాతలంపు కావున మీకును నామార్గ ముపదేశింప తల
పెట్టినాను.

అక్షరజ్ఞాన మంతట పనికిరా దనరాదు. అయిన దానినే
పెద్దచేసి శరణ్య మనరాదు. అది కామధేనువుగాదు. మన
ప్రాచీనవిద్యాపద్ధతి మంచిది. దానిలో శీలనిర్మాణము ప్రథ
మాంగము. అదియే నేర్పదగిన ప్రథమవిద్య. దానిపై కట్టు
హర్మ్యము ఉత్తమస్థితము. నేటివిద్య గడించి దానికి రంగు
పెట్టవచ్చును.

చదువరి: ఐన ఇంగ్లీషువిద్య అనవసర మని మీ రందురా?

సంపా: అవసరము, అనవసరము రెండును. కోట్లప్రజకు
ఇంగ్లీషునేర్పుట వారిని దాస్యమున వేయుట. మెకాలేప్రభువు
మనవిద్యకువేసిన బునాదులు మనలను దాసులం జేసినవి.
అతనియుద్దేశ మది కాకపోవచ్చును. ఫలముమాత్రము తప్ప
లేదు. స్వరాజ్యమునుగురించి మాట్లాడుటకుకూడ మన ఇం
గ్లీషే కావలసివచ్చినది. అది సిగ్గుమాలినస్థితి కాదా?

ఇక మనవిద్యాపద్ధతు లందురా సీమలోవా రేకాలముననో
త్యజించినవి మనకు నేడమృతప్రాయములు. ముఖ్యామంత్రి

లాయడుజార్జివేల్సుపిల్లలు వెల్షుభాషనే అభ్యసింపజేయ ప్రయత్నించుచున్నారు. మనగతి? పత్రికలకు, సభలకు, ఉత్కృష్ట భావప్రకటనకు, తుదకు జాబులకు అన్నిటికి ఇంగ్లీషే. ఇట్లే జరుగుచుపోయినయెడల అచిరకాలములోనే మనసంతతివారు మనల శపించవలసి యుందురు.

నేను బారిష్టరు. కోర్టులో నే నింగ్లీషే మాట్లాడవలె. నా ఇంగ్లీషును ఇంకొకరు నా మాతృభాషలోనికి తర్జుమా చేయవలసి యున్నది. ఇది దాస్యముకాదా? దీని కెవ రుత్తరవాదులు? ఇంగ్లీషువారు కాదు. మనమే. భారతజాతిశాపములు వారికి దగులవు. మనకు తగులును.

మీ ప్రశ్నకు అవును కా దని రెండురీతులు ప్రత్యుత్తరమిచ్చితిని. కా దనుటకు కారణములు నిరూపించితిని. ననుటకును కారణములను దెల్పెద. మనకు ఇప్పటి నాగకము మిక్కిలి ఎక్కువగా పట్టుపడినది. కాబట్టి ఇంగ్లీషులను వెంటనే వీడిపోదు. ఇంగ్లీషువారు తమనాగరకము యెంత ఏవగించుకొనునది ఎరుంగుటకును ఇంగ్లీషు అవసరము ఇంగ్లీషుమూలకముగా ద్రవ్య మార్జింపవలె నను దురాశ త్రము మానితీరవలెను. ఇప్పు డింగ్లీషునేర్చినవారు తమసతతులకు జీవరహస్యజ్ఞానము నంతయు దేశభాషలమూలకవగా నేర్పవలెను. వారు పెద్దలైనప్పుడు ఇంగ్లీషు నేరువవచ్చున ఇట్లు మితముగా నేర్చుటలోకూడ ఏవిషయ మభ్యసనసేయవ

ఏవిషయము కాదు, ఏశాస్త్రము అవసరము ఏశాస్త్రము కాదు అనువిషయము లాలోచింపవలసి యుండును. ఇంగ్లీషు పట్టములకు మన మెప్పుడు ఆశింపమో అప్పుడే మనపరిపాలకులు గాఢాలోచనపాలు గావలసియుందురు.

చదువరి: అయిన మన మేవిద్య నేరువవలెను?

సంపా: మనభాష లన్నిటిని అభివృద్ధిచేయవలెను. ఇంగ్లీషులోని ఉత్తమగ్రంథములను ఇందులోనికి వ్రాయవలెను. శాస్త్రములన్ని నేర్చెద మనునటమును మానవలెను. నీతిమత బోధకు అగ్రస్థాన మీవలెను. విద్యావంతు డగుప్రతిహైందవుడు తనదేశభాష నెరుంగుటతోడగూడ హిందీ నేరువవలెను, దానితోగూడ హిందువైన సంస్కృతము, మహమ్మదీయుడైన అరబ్బీ అభ్యసింపవలెను. కొందరు హిందువులు అరబ్బీ నేర్చుటయు కొందరు మహమ్మదీయులు సంస్కృతము నేర్చుటయు అవసరము. హిందీ సామాన్యభాష కావలెను. దానికి లిపి నాగరీ పారసీలు ఇష్టానుసారము వాడవచ్చును. హిందూమహమ్మదీయ సోదరభావము వృద్ధియగుటకు రెండులిపులును తెలియుట యుత్తమము. ఇది చేయగలమేని ఇంగ్లీషుభాషను కొంతకాలములో ముఖ్యస్థానమునుండి కదల్చివేయవచ్చును. బానిసలగు మనకు ఇదియంతయు నవసరము. మన బానిసము వలన దేశ మంతయు బానిసమైనది. మన స్వాతంత్ర్యముతో దేశమంతయు స్వతంత్రము కాగలదు.

చదువరి: అయినను దానిం దక్క మన మేమియు చేయ జాలము. భారతభూమి ఏనాడును దైవమును త్యజించునది కాదు. నాస్తిక మిచ్చట పెచ్చు పెరుగజాలదు. కార్యము కష్టతమము. మతవిద్యనుగూర్చి యాలోచించినచో తల తిరుగు చున్నది. మన మతాచార్యులు దంభోపేతులు, స్వార్థపరులు, వారిని మనము వినియోగింపవలసియుండును. ముల్లాలు, దస్తూరులు, బ్రాహ్మణులు మతవిద్యకు ధర్మకర్తలైయున్నారు. వారు జాగ్రత్తపడి ధర్మమునెరవేర్చలేని ఇంగ్లీషువిద్యచే మనకు గలిగినశక్తిని తత్కార్యసాధనకు నియోగింతుము. మత మను మహాసముద్రగర్భము గంభీరముగనే యున్నది. భూస్పర్శగల యలలుమాత్రము కలుషితములై యున్నవి. ఈయలలు మన ము. కోటానుకోట్లుప్రజ అకలుషితులు. మనము హైందవ త్వము నందవలెను. పాశ్చాత్యనాగరకమును తరుమవలెను. మన పరిణామమున అభివృద్ధి, లోపములు, దోషములు, అపా యములు కలుగవచ్చును. కాని ముక్తిమాత్రము కరతలా మలకము.

## పందొమ్మిదవ ప్రకరణము.



### యంత్రసామగ్రి.

చదువరి: పాశ్చాత్యనాగరకము వల దందురే. ఆ యంత్ర సామగ్రియు వల దనియేనా ?

సంపా: ఈ ప్రశ్న వేసి నాకు తగిలినగాయమును చిదుక పొడిచితిరి. దత్తుకృత హైందవార్థికచరిత్రను చదివినప్పుడు నేను కన్నీరునించితిని. మరల నా కది జ్ఞాపకమునకురా నా మానసము పీడిత మగుచున్నది. యంత్రములే భారతభూమిని బీదవడ జేసినవి. మాంచెస్టరు మనకుచేసిన యపచారము గణించుటకు రానిది. మాంచెస్టరువలననే మన చేతిపనులన్ని యు మృతకల్పము లైనవి.

మరచితి నేనే పొరవడుచున్నాను. మాంచెస్టరు నెట్లు నిందింపవచ్చును. మనము మాంచెస్టరువస్త్రముల ధరించితిమి. కాబట్టి మాంచెస్టరు వానిని మనకు నేసియిచ్చినది. బంగాళమువారి ధైర్యమును విని సంతసించితిని. అచ్చట వస్త్ర యంత్రాలయములు లేవు. కాబట్టి పూర్వపు చేతినేతను వారు పునరుద్ధరింప గలిగిరి. బొంబయి వస్త్రయంత్రములకు బంగాళమునుండియు ప్రోత్సాహము కలుగుచుండుమాట నిజమే.

బంగాళము యంత్రసహాయమున సిద్ధమయిన యెల్లవస్త్రము లను బహిష్కరించియుండిన బాగుండును.

యంత్రములు యూరోపును నశింపజేయ నారంభించినవి. ఆనాశము ఇంగ్లండుతలుపు దట్టుచున్నది. ఇప్పటి నాగరకము నకు యంత్రములు ముఖ్యచిహ్నములు. ఇవి పాప కారణములు.

బొంబయి వస్త్రయంత్రములలో పనిచేయువారలు దాసు లైనారు. అచ్చట పనిచేయుస్త్రీలస్థితి మహా విషాదకరము. యంత్రశాలలు పుట్టకముందు ఈస్త్రీలు ఆకలికి మాడుచుండ లేదు. యంత్రములపిచ్చి మన దేశములో ప్రబలినయెడల ఇది యభాగ్యదేశము కాక మానదు. విపరీతముగా దోచవచ్చు నేమో కాని మన దేశములో యంత్రాగారములు పెంచుటకన్న మాంచెస్టరుకు ద్రవ్యముపంపి అచ్చటినుండి దిగుమతియగు పనికిరానిగుడ్డలను ధరించుటే మేలు. మాంచెస్టరుగుడ్డ లుప యోగించుటవలన మనకు ద్రవ్యనష్టముమాత్ర మగుచున్నది. మాంచెస్టరు నిచ్చట రూపుదాల్ప చేసితిమేని మన జాతీయ వంశమునకే ముప్పు వాటిల్లి మన నైతికజీవనమే నశింపగలదు. ఇందుకు తార్కాణము వలయునేని యంత్రాగారములలోని పనివారలనే సాక్ష్యమునకు కోరుచున్నాను. యంత్రాగార ములమూలకముగా ధనము గడించినవారు ఇతర ధనవంతుల కంటె నెక్కువ మంచివారుగ నుండపోరు. రాక్కుఫెల్లరు భారతభూమిలో పుట్టినంతమాత్రముచేత అమెరికాలో పుట్టిన

వానికంటె మెరుగుగా నుండునని నమ్ముటకు రాదు. బీదభారతభూమి స్వతంత్రము కావచ్చును. కాని అవినీతిచే ఈ భూమి భాగ్యవంత మగునేని తరువాత స్వతంత్ర మగుట కష్టము. డబ్బుగలవారు బ్రిటిషుపరిపాలనను బలపరతురు. వారి లాభాలాభములు ఆ పరిపాలన లాభాలాభములతో మేళవమై యున్నవి. డబ్బు మానవుని బలహీను నొనర్చును. స్త్రీలోలతయు తత్సమానము. రెండును విషమే. విషసర్పదష్టుడు ఈ రెంటి దాసునకంటె మేలు. ఏలయన, విషస్పర్శ దేహమును మాత్రము నశింపజేయును. ఇయ్యవి దేహమును, మానసమును, ఆత్మను అన్నిటిని నశింపజేయును. కాబట్టి యంత్రాగారాభివృద్ధి యేదో లాభ మని మనము సంతసింప బనిలేదు.

చదువరి: అయిన యంత్రాగారములు మూయవలసినదేనా ?

సంపా: అది కష్టము. ఏర్పడినదానిని ఎత్తివైచుట సుకరము కాదు. కాబట్టి ప్రారంభింపకుండుటయే పరమవివేకము. యంత్రాగారాధిపుల ఖండింపరాదు. వారియెడ కరుణచూపవలెను. యంత్రాగారములను వారు వదలవలెననుట విపరీతము. వానిని పెంచకుడనిమాత్రము ప్రార్థేయపడవచ్చును. వారు మంచివారగుదురేని తమ వ్యాపారమును కురుచచేయుచు వత్తురు. వేనవేలయిండ్లలో ప్రాచీనమగు నేతమగ్గమును నెలకొల్పి అందగు నుత్పత్తినంతయు వారు కొననగును. యం

త్రాగారాధీశు లిదిచేసినను చేయకున్నను ప్రజ యంత్రాగార ములలో చేసిన వస్త్రములను ధరించుట మాని వేయవచ్చును.

చదువరి: ఇంతకాలమును మీరు యంత్రవినిర్మితవస్త్ర ములసంగతియే చెప్పుచువచ్చితిరి. ఇంక నెన్నియోవస్తువులు యంత్రనిర్మితము లున్నవి. వానిని దిగుమతియైన జేయవలెను. లేదా వానికై మనదేశమున యంత్రముల నైనను స్థాపించ వలెను.

సంపా: నిజము. మన దేవతలనుగూడ — విగ్రహములను కూడ నని యర్థము.—జర్మనీవారు చేయుచున్నారు. నిప్పుపు ల్లలు, గాజు, గుండుసూదులు ఇత్యాదులమాట చెప్ప నేల? నాయుత్తరము మీ కిది. ఈ వస్తువులు రాకముందు భారత భూమి ఏమిచేసినది? అదియే నేడును చేయవలెను. యంత్ర సహాయము లేక గుండుసూదులు చేయలేనంతకాలము మన ము వానిని ఉపయోగింపవలదు. గాజు జాజ్వల్యమానము మన కక్కర లేదు. ఎప్పటివలె ప్రమిదలుచేసి వత్తిచేసి దీపము ముట్టించుచుందుము. అట్లు చేసినచో కండ్లకు రక్ష. కర్చు తక్కువ. స్వదేశిసంరక్షితము. స్వరాజ్యము చేరువ.

అందరు ఇన్ని ఒకేపర్యాయము చేయుదు రనికాని కొంద రైనను అన్ని యంత్రనిర్మితవస్తువుల వదలుదు రనిగాని నా యర్థము కాదు. భావము సరియైన దయినయెడల ఏదియేది వదలవచ్చునో కనిపెట్టి వదలుచు పోదురు. కొందరు చేయు

నది అంత యనుకరింతురు. విత్తు వృక్షమై మఱ్ఱివలె వ్యాపించును. నాయకులు చేయునది ప్రజ తప్పక యనుకరింతురు. కష్టము కాదు. చిక్కును లేదు. ఇతరులు మనతోడంగూడ నడచువరకును నేను మీరు నిలువ నక్కరలేదు. పనిబూనని వారే నష్టులు. తెలిసియు ప్రారంభింపనివారు పిరికివారు.

చదువరి: ట్రాంబండ్లను గురించియు విద్యుచ్ఛక్తిని గురించియు మీ రేమందురు?

సంపా: ఈ ప్రశ్న యప్రస్తుతము. దీని కర్థమే లేదు. రైల్లే అక్కరలే దన్నప్పుడు ట్రాంబండ్లును అక్కరలేదే. యంత్రములు పాములపుట్టలు. అందులో నొకపా ముండవచ్చును. నూరుపాము లుండవచ్చును. యంత్రములవృద్ధి యున్నచోట నగరములవృద్ధియుం గలదు. నగరములుకలచోట ట్రాంబండ్లు, రైల్లు తప్పవు. విద్యుచ్ఛక్తియు నటనే తాండవమాడును. ఇంగ్లీషు గ్రామముల కీదంభములు ప్రాకలేదు. యంత్రాధారమగు రాకపోకలు ప్రబలినచోట ప్రజల ఆరోగ్యము చెడిపోయిన దని ధర్మమెరుంగు వైద్యులు చెప్పుదురు. యూరోపు నగరములలో నొక్కట నొకప్పుడు ద్రవ్యము లేకపోయెను. ట్రాములకు వకీళ్లకు, వైద్యులకు ఆదాయము తగ్గిపోయెను. ప్రజలకు ఆరోగ్యము అలవడెను. ఇది నేనెరిగిన సంగతి. యంత్రములవలన ఒక్కమేలు కల దని నాకు దోచదు. వానివలన నష్టములను గురించి గ్రంథములు వ్రాయవచ్చును.

చదువరి: మీరు చెప్పుచుండున దంతయు యంత్రమూలకముగా అచ్చగునుకదా? ఇది మంచిదా చెడుపా?

సంపా: విషమును జంపుటకు విష ముపయోగించుట కలదు. ఇది అట్టిది. దీనివలన యంత్రములపక్షమున కేమియు సహాయము కాదు. యంత్రము మము వీడిపోవుచు ఇట్లనును. "ననుగురించి జాగ్రత్తపడుడు. నన్ను వీడి దూరముపొండు. నావలన మీకు లాభము లేదు. అచ్చువలన కలుగులాభము యంత్రములపిచ్చి పట్టినవారికే మాత్ర మనుట నెరుంగుడు." కాబట్టి, ముఖ్యవిషయమును మరువకుడు. యంత్రసంస్థలు కీడు. ఇది జ్ఞాపకమున్న యంత్రములను మనము దప్పించుకొనవచ్చును. మనయుద్దేశము సద్యఃఫలముగా నెరవేరుటకు దైవము మార్గము తేర్పరచియుండ లేదు. యంత్రసామగ్రి వరదాన మని యంగీకరించుట మాని చెఱుపనుట గుర్తింతుమేని అది క్రమముగా నశింపగలదు.



## ఇరువదియవ ప్రకరణము.



### ఉపసంహారము.

చదువరి: మీయభిప్రాయములను బట్టిచూడగా మీరు మితవాదులు గారు. జాతీయవాదులుం గారు. మీది తృతీయపక్షముగా దోచుచున్నది.

సంపా: అది పొరబాటు. నా మానసమున మూడవపక్షము లేదు. అందరొకేవిధమున నాలోచింతు మనుట వెఱ్ఱి. మితవాదు లందరు చూచా తప్పక ఏకాభిప్రాయు లని చెప్ప రాదు. అంతియ గాదు. సేవమాత్ర మాదర్శముగా కలవారికి కక్షయేడిది? మితవాదులు జాతీయవాదులు ఇరువురకుం గూడ నే సేవ యొనర్చువాడ. ఎచ్చట భేదాభిప్రాయము కల్గును అచ్చట దానిని వారికి నివేదించి నామార్గమున నేను సేవచేయుచు పోదును.

చదువరి: అయిన ఈ రెండుకక్షులవారికి మీ రేమి యుపదేశింతురు.

సంపా: జాతీయవాదులకు నేను చెప్పున దిది. "మీరు భారతభూమికి స్వరాజ్యము కోరుట నే నెరుగుదును. అడిగినంతమాత్రన మన కది రాదు. ప్రతివాడును దానిని సంపాదించవలసి యుండును. ఇతరులు నాకు సంపాదించిపెట్టునది

స్వరాజ్యము కాదు. పర పరిపాలనము. కాబట్టి ఇంగ్లీషువా రిని వెడలగొట్టినమాత్రాన మీరు స్వరాజ్యము సంపాదించిన ట్లెన్నరాదు. స్వరాజ్యముయొక్క నిశ్చయస్వరూప మిదివర లో మీకు వర్ణించితిని. దీనిని పశుబలముచేత ఎప్పుడును సంపాదింప వీలులేదు. పశుబలము భారతభూమికి స్వభావ సిద్ధసాధనము కాదు. కాబట్టి ఆత్మశక్తిమీదనే మీర లాధార పడవలసి యుందురు. మనయుద్దేశము నెరవేర్చుటకు ఏసంద ర్భముననను బలాత్కార మవసర మని మీ రెంచరాదు.

మితవాదుల కేనుబోధించున దిది. "వట్టియర్జీలు పంపు చుండుట మానహీనత. దానివలన మనము లోకువ యని మనమె యంగీకరించినవా రగుదుము. బ్రిటిషుపరిపాలన వీడ రా దనుట ఇంచుమించు దేవుడు లే దనుటయే. దైవ మొ క్కడుదప్ప మరి యేమానవుడును ఏవస్తువును వీడరానిది కాదు. అంతేకాక, ఇంగ్లీషువారు భారతభూమిలో నే యుండి యే తీరవలె ననుట వారిని గర్విష్ఠుల జేయుటయె.

ఇంగ్లీషువారు మూటలు ముల్లెలు కట్టుకొని వెళ్లిపోదు రేని భారతభూమి విధవ కాబోదు. వారుండగా శాంతము వహింపవలసినవారు వారు పోయినపిదప దేశసంరక్షణకు పోరాడవచ్చును. ఆకస్మికోద్భవమును నడంపరాదు. దానిని పరిణామ మందనిచ్చుటయె కార్యము. కాబట్టి మనము శాం తముగా జీవించుటకుముందు మనలో మనము కలహింపవలసి

యుందుమేని అది సాగుటయే మేలు. బలహీనుల సంరక్షిం చుటకు మూడవవా రనవసరము. ఈ సంరక్షణయే మనలను పిరికివారి నొనర్చినది. ఇట్టి సంరక్షణ బలహీనులను నింకను నెక్కువబలహీనుల గావించునుగాని వేరు కాదు. ఇది మనము గుర్తెరింగినం గాని మనకు స్వరాజ్యము లభింపదు. ఇంగ్లీషు మతాచార్యు డొకరు చెప్పినమాటలు వినుడు. స్వరాజ్యము లోని అరాచకత్వము పరరాజ్యములోని సక్రమశాంతి జీవ నమునకంటె లెస్స. ఆ మతాచార్యుడు స్వరాజ్యమునకు నే నిచ్చిన హైందవ స్వరాజ్యార్థము నియ్యలేదు. మనకు ఇం గ్లీషుపరిపాలన కానిండు, హైందవపరిపాలన కానిండు నిరం కుశత్వము అక్కరలేదు. ఇది మనము నేరువవలెను. ఇతరు లకు నేర్పవలెను.

ఈ యభిప్రాయ మంగీకృత మైనయెడల మితవాదులు జా తీయవాదులు ఏకము కావచ్చును. ఒకరికొకరు భయమందు టకు గాని ఒకరినొకరు అనుమానించుటకు గాని యెడ ముండదు.

చదువరి: అయిన మీ రింగ్లీషువారి కేమి తెల్పుదురు.

సంపా: గౌరవభావముతో వారి కీమాట లందచేయు దును. "మీరు మాపరిపాలకు లనుట నే నంగీకరించెద. మీరు ఖడ్గబలముచే భారతభూమి నేలుచున్నారా, నాయంగీ

కారముచే నేలుచున్నారా యను ప్రశ్నను విమర్శించుట యవసరము కాదు. మీరు మాదేశములో నుండుటకు నాకభ్యంతరము లేదు. పరిపాలకులు మీరైనను ప్రజల సేవకులుగా మీ రిట నుండవలసియుందురు. మీరు కోరునట్లుగా చేయవలసినవారము మేము గాము. మేము కోరినట్లుగా చేయవలసినవారు మీరు. మీరు ఇటనుండి ఇదివరలో తీసికొనిపోయిన ద్రవ్యము నుంచుకొనుడి గాని ఇకముందు తీసికొనిపోకుడు. మీ కిష్టమేని భారతభూమిసంరక్షణ మీ రుంచుకొనుడు. మానుండి వ్యాపారలాభము గడించు నభిప్రాయము మాత్రము మీరు మానవలసినది. మీరు ప్రోత్సహించు నాగరకము నిజముగా నాగరకవ్యతిరేక మని మావిశ్వాసము. మీ నాగరకమునకంటె మా నాగరకము వేయిరెట్లు మిన్న యని మా నమ్మకము. మీ రీ నిజ మెరుంగుదు రేని మీకే లాభము. మీ రెరుంగ రేని మీ లోకోక్తులలో నొక్కదాని ననుసరించి మాభూమిలో మే మెట్లు నివసింతుమో అదేరీతిని మీరును నివసింపవలసి యుందురు. మామతములకు వ్యతిరేకముగా మీ రేమియుం జేయరాదు. పరిపాలకు లైనందున హిందువులయెడ మీధర్మము నెరవేర్చుటకుగా మీరలు ఎద్దు మాంసము మానవలెను. మహమ్మదీయులయెడ అదేధర్మమును నూనుటకు సూకరమాంసమును వీడవలెను. భీతచిత్తులమై యుండినందున మే మింతకాల మీమాట యెత్తలేదు.

కాని మీ నడవడిచే మామానసమునకు వైక్లబ్యము కలుగ లేదని మాత్ర మనుకొనబోకుడు. స్వార్థముమై కాని భయ ముమై కాని మా యభిప్రాయముల వెలిబెట్టు చుండలేదు. ఇప్పుడు నిర్భయముగా తెలియపరచుట మా ధర్మము కావున తెలుపుచున్నాము. మా ప్రాచీనవిద్యాలయములు న్యాయ స్థానములు పునర్జీవితములు కావలెను. భారతభూమికి సా మాన్యభాష హిందీ కాని ఇంగ్లీషు కాదు. మీర లందువలన దానిని నేర్చుకొనవలెను. మీతో మేము మా జాతీయభాష లోనే ఉత్తరప్రత్యుత్తరములు జరుపగలము.

రైళ్లకు, సైన్యాలకు మీరు కర్చుపెట్టుచుండుట మా కసమ్మతము. రెంటికి అవసరము మాకు కానరాదు. రుష్యా వలన మీకు భయ ముండవచ్చును. మాకు లేదు. ఆజాతి పైబడివచ్చిన మేము చూచికొందుము. మీరు మాతో నప్ప టికి నుండురేని ఇరువురము కలసి చూచుకొందము. యూ రోపియను వస్త్రములు మా కక్కరలేదు. మా దేశమున సిద్ధ మయినవస్తువులతో, ఉత్పత్తులతో, సంతుష్టి నందు దుము. మీ రొకకన్ను మాంచెస్టరుమీద ఒక్కకన్ను భా రతభూమిమీద పెట్టి యుంచకుడు. మన లాభాలాభము లే కము చేసికొనిననే మన మేకముగా నుండి పనిచేయవచ్చును.

దీనిని మేము మీకు చెప్పుట దంభపరత్వమున గాదు. మీకు గొప్ప సైనికబలము కలదు. మీ నావికబల మసా

మాన్యము. మీతో సరిసమానముగా మీ మార్గమున పోట్లాడ నెంచుదుమేని మీకు నిలువజాలము. పై మేము తెలిపినకోరికలు మీకు సరిపడవేని మేము పాలితులుగా నుండము. మీ కిష్టమేని మమ్మును తుపాకులక్రింద తరిగివేయుదురు గాక. ఫిరంగుల యెదుటనిడి తుత్తునియలుగా ఛేదింతురు గాక. మా సంకల్పమునకు వ్యతిరేకముగా మీరు ప్రవర్తించునెడల మీకు మేము సహాయముచేయము. మా సహాయము లేక మీ కొకయడుగైనను పెట్టలే రనుటయు మే మెరుంగుదుము.

మీకు అధికారము కలదు. దానిమత్తుచే మీరు మమ్ము నవ్వుదురు కాబోలు. వెంటనే మీ మోహమును మేము పాపలేము. కాని మాయందు పౌరుషము కొరవడదేని అచిరకాలముననే మీ రెంతటి ఆత్మవినాశకమార్గము నవలంబించినదియు బుద్ధిపటిమలోపమున మము నవ్వినదియు మీకే యెరుకపడగలదు. మీరు ఆధ్యాత్మికజాతికి చెందినవా రని మా హృదయపూర్వకవిశ్వాసము. మా వసించుభూమి ఆధ్యాత్మిక సత్యములకు పుట్టిన యిల్లు. మన మెట్లు ఒక్కరికొక్కరు తటస్థించినదియు విమర్శింప నక్కరలేదు. కాని మన పరస్పర సంబంధములు పరస్పరలాభమునకు వినియోగించుకొనుట మాత్రము సాధ్యము.

భారతభూమికి పయనమై వచ్చియుండు ఆంగ్లేయులు మీరు సరియైన ఆంగ్లజాతిప్రతినిధులు కారు. సగ మాంగ్లమై పోయిన మేమును సరియైన భారతజాతిప్రతినిధులము గాము. మీరు చేసినదంతయు ఇంగ్లీషుజాతికి తెలియునేని ఆజాతి అనేకవిషయములలో మీతో నేకీభవింపక పోవును. భారతజాతిలో నెక్కువభాగము మీతో నెక్కువసంబంధము పెట్టుకొనలేదు. మీ నాగరకమును కొంచ మావలపెట్టి మీ వేదగ్రంథములనే వెదకుదురేని మేము కోరునదంతయు న్యాయమనుట మీ కందులోనే కానవచ్చును. మేము కోరేకోరికలన్ని నెరవేరిననే మీ రిట నుండనగును. మీ రట్లుందురేని మీవద్ద మే మెన్నియో విషయములు నేర్చుకొందుము. మీరును అట్లే మావద్ద నేర్చుకొనగలరు. అట్లు చేసినయెడల మనము పరస్పరము లాభ మందుదుము. లోకకల్యాణమునకును తోడ్పడుదుము. ఇదియంతయు మనసంబంధము అధ్యాత్మికబంధముచే కట్టబడినప్పుడే సాధ్యము.

చదువరి: మీరు జాతి కేమి చెప్పుదురు ?

సంపా: జాతియెవరు ?

చదువరి: మనకార్యముల కేజాతి నింతసేపు ఆలోచించుచుంటిమో ఆజాతి, యూరోపియనునాగరకము నెవ్వరి నంటినదో, అట్టి మనము, స్వరాజ్య మెవ్వరము కోరుచున్నామో ఆ మనము.

సంపా: వీరికి నే చెప్పున దిది. నిజమైనప్రేమ స్వరూపము నెరింగినవాడు నిర్భీతుడై ఇంగ్లీషువారితో ముఖాముఖిని పైరీతిని వచింపగలడు. ఎవ్వరు భారతనాగరకమే ఉత్తమమనియు యూరోపియనునాగరకము మూడునాళ్లముచ్చట యనియు మనఃపూర్వకముగా నమ్మెదరో వారే యీపనికి వలంతులు, ఇట్టి మూడునాళ్లముచ్చట నాగరకము లెన్నియో కలిగినవి, గతించినవి, కలుగగలవు, గతింపగలవు. ఎవ్వరు ఆత్మబలమును తమంతట తా మెరింగి పశుబలమునెదుట జంకరో, పశుబలము నెప్పుడును నుపయోగింపదలంపరో వారలే ఇందుకు సమర్థులు. ఇప్పటి విషమస్థితిని శల్యాగతంబుగ ననుభవించి దీనిపై సంపూర్ణాసంతుష్టి ఎవ్వరు పొందినారో వారలే ఇందుకు సాధకులు.

అట్టివాడు ఒక్కడు భారతపుత్రు డున్నను అతడు పైరీతిని ఇంగ్లీషువారితో ప్రసంగింపగలడు. వా రాతనిమాటలు విని తీరవలసి యుందురు.

ఈ కోరికలు మనము ప్రకటించుకోరిక లనుకొనరాదు. ఇవి మనమనస్థితిని ప్రకటించునట్టివియె. అడుగుటమాత్రాన మన కేదియు నమరదు. మనము సంపాదించవలసి యుందుము. అందుకు తగినశక్తి కావలెను. అది యెవ్వారికి కలదందురా? ఏవాడు

(౧) ఎప్పుడో తప్ప ఇంగ్లీషుభాషను ఉపయోగింపడో

(౨) వకీలైయున్నచో తనవృత్తిని వదలి చేతిమగ్గమున కూర్చొనునో

(౩) వకీలైయున్న, తనజ్ఞానమును కాలమును దేశప్రజకు ఆంగ్లేయులకు సంగతిసందర్భములను బోధించుటకు వ్యయ పరచునో

(౪) వకీలైయున్న, కక్షిదారులకలహములతో జోక్యము పెట్టుకొనక కోర్టులను త్యజించి తనయనుభవములను చెప్పుట చేత ఇతరుల నదేమార్గమునకు త్రిప్పునో

(౫) వకీలైయున్న, వకీలువృత్తి వదలునట్లే జడ్జిపదవిని కూడ త్యజించునో

(౬) వైద్యుడైయున్న, వైద్యమును మాని దేహములకు చికిత్సలు చేయుటకన్న ఆత్మలకు చికిత్స చేయుట మే లని పని బూనునో

(౭) వైద్యుడైయున్న, యూరోపియను వైద్యముపేరిట చేయబడు జంతుహింసమూలకమున రోగములు కుదుర్చుట కన్న శరీరములు రోగపీడితము లైనను తప్పు కా దని యెరుంగునో

(౮) వైద్యుడైయున్నను, చేతిమగ్గమున పనికి దిగి రోగులు తనదగ్గరకు వచ్చినప్పుడు వారి రోగకారణములను చెప్పి వారిని వృథామూలికలచే వేధించుటకన్న రోగకారణము పో

ద్రోల ప్రయత్నించునో, మూలికలుతినక రోగి చచ్చినను లోక మంతముకాదు. రోగికిని నష్టములేదు. అని ఎరుంగునో

(౯) ద్రవ్యవంతుడైయున్నను, ఆద్రవ్య ముండునా పోవు నా యని మీనం మేషము లెక్కలువేసి భీతిచెందక మోమో టముదక్కి తనమానసమున నున్నదానిని పల్కునో,

(౧౦) ద్రవ్యవంతుడైయున్నను, ద్రవ్యమును చేతిమగ్గ ములు పెట్టుటకు వినియోగించి తాను చేతినేతవస్త్రములు ధరించుటచే ఇతరుల నామార్గమున ప్రోత్సహించునో

(౧౧) ఇతర భారతపుత్రులవలె, ఈతరుణము, తనకును వ్రతములకు ఉపవాసములకు ప్రాయశ్చిత్తములకు కాల మను టన్న నెరుంగునో

(౧౨) ఇతర భారతపుత్రులవలెనే, ఇంగ్లీషువారిని దూ రుట వ్యర్థ మనియు మనముకోరగా వారు వచ్చి రనియు మన ముంచుకొనుటవలన వా రున్నా రనియు మనము సంస్కా రము కనబరచినప్పుడే వారు పోవుటయో తమ్మును సంస్క రించుకొనుటయో చేయుదు రనియు నెరుంగునో

(౧౩) ఇతరులవలెనే, దుఃఖసమయమున సుఖానుభోగ ము లననుకరణీయము లనియు పతితులమై యుండు యుగ మున కారాగారమున నుండుట ప్రవాసమున నుండుట ప్రశ స్తము లనియు నెరుంగునో

(౧౪) ఇతరులవలెనే, ప్రజలమేలు నాలోచించుటకు మనము కారాగారప్రాప్తినుండి తప్పించుకొనవలె ననుట అంధాభిప్రాయ మని యెరుంగునో

(౧౫) ఇతరులవలెనే, మాటకంటె పాటు మే లనియు, మనము నమ్మినది నేరుగా చెప్పి ఫల మనుభవించుట యుత్తమ మనియు, మనమాటల కప్పుడుగాని అర్థ ముండదనియు నెరుంగునో

(౧౬) ఇతరులవలెనే, మనము కష్టపడిననే స్వతంత్రుల మగుదు మనునది విశ్వసించునో

(౧౭) ఇతరులవలెనే, పాశ్చాత్యనాగరకమును ప్రోత్సహించినందులకు అండమానుదీవులలో ఆజన్మప్రవాస మున్నను తగినప్రాయశ్చిత్తము కా దని తెలిసికొనునో

(౧౮) ఇతరులవలెనే, ఏదేశజాతియు కష్టపడక అభివృద్ధి కాలే దనియు పశుబలయుద్ధముననే, నిజమైనశౌర్యము, ఇతరుని చంపుటకాక తాకష్టముల భరించుట యైనప్పుడు, సాత్త్వికనిరోధమున స్వార్థత్యాగమే ముఖ్యాంగ మనియు గురుతించునో

(౧౯) ఇతరులవలెనే, ఇంకొకరు చేసిన మనము చేయుదు మనుట వ్యర్థులమాట యనియు, మనము న్యాయ మని నమ్మినది చేసినచో మార్గముం గన్ని ఇతరులు తప్పక చేయుదు రని

యు, కల్పించిన, రుచికరవస్తువు మరియొకరు చవిచూచువరకు నిలుచుట స్వభావము కాదనియు జాతీయోద్యోమ మొసన ప్పుట తదర్థమై ఇడుమలపడుట రుచికరకార్యజాల మ్మనియు, నిర్బంధముచే కష్టపడుట కష్టము కాదనియు తలపెట్టునో

వానికే ఆశక్తి యలవడును.

చదువరి: ఇది గొప్పజాబితా యైనది. అందరును దీని సే నా డనుకరించుటో ?

సంపా: హారవడకుడు. ఇతరులతో మీకును నాకును సంబంధము లేదు. ప్రతివాడు తనధర్మనిర్వహణ మాలోచింప వలసినది. నాధర్మము నెరవేర్చి ఆరీతిని నాసేవనే చేసికొందు నేని ఇతరులసేవ సులభముగా చేయగలను. మీకు సెల వొసంగుటకుముందు మరల నొక్కపర్యాయము నా చెప్పినది జ్ఞాపక పరచెద.

(౧) నిజమైన స్వారాజ్యము స్వరాజ్యము అనగా స్వనిగ్ర హము.

(౨) దానికి మార్గము సత్యాగ్రహము అనగా ఆత్మశక్తి, ప్రేమశక్తి.

(౩) ఈశక్తిని ప్రచారపెట్టుట కన్నిట స్వదేశి మూలా ధారము.

(౪) మనము చేయునట్టి పనియంతయు ఇంగ్లీషువారి నభ్యంతరపెట్టుదు మని కాని వారికి ప్రతిచేయవలె ననిగాని చేయరాదు. మనధర్మ మని చేయవలెను. ఇంగ్లీషువారు ఉప్పుపన్ను తీసివేసినా రనుకొందము. మనద్రవ్యము వెనుకకు మరల్చినా రనుకొందము. ఉత్తమోద్యోగములు భారతపుత్త్రుల కిచ్చినా రనుకొందము. ఇంగ్లీషుసైన్యములను తీసివేసినా రనుకొందము. అప్పటికిని యంత్రనిర్మితవస్తువులను వినియోగింపబోము. ఇంగ్లీషుభాష నుపయోగింపబోము. ఇంగ్లీషువారి పరిశ్రమలను ప్రోత్సహింపబోము. ఇవి సహజముగనే స్వభావసిద్ధముగనే దుష్టములు. కాబట్టి యివి మన కక్కరలేదు. ఇంగ్లీషువా రనిన నాకు వైరములేదు. వారి నాగరక మనిన నాకు వైరము. నాయభిప్రాయ మడిగితిరా ఇదివరలో మనము స్వరాజ్య మనుపదమున కర్థము తెలియక దాని నుపయోగించినాము. నా కర్థమయినంతవరకు దాని స్వరూపమును విశదపరచుటకు ప్రయత్నించినాను. ఆరూపమున దాని నారాధించుటయె ముందు నాజీవితమున ధర్మ మని నాయంతరాత్మ బోధించుచున్నది.



నలవార్ధిజలము చుం యన నింకఁ గ్రోలి
బలసి లోకములెల్ల భస్మీకరింప
నడరెనో బడబాగ్ని యనఁ జుట్టు ముట్టి
పుడమియు దిశలు నభోమండలంబుఁ
గప్పి మండుచు వచ్చు కార్చిచ్చు రాక
తప్పక వీక్షించి ధరణివల్లభుఁడు
జాలి నెక్కొన నక్కజంబునఁ జింతఁ
దూలుచుఁ దనదేవితోడ నిట్లనియె
'నీవనవహ్ని నిం కేవిధిఁ గడచి
పోవచ్చుఁ జావక పోరాదు మనకు
నంకించి మునితోడ నాడినమాట
బొంకు గాకుండ నాపూనిననాఁటి
మితికి ఋణం బెల్లఁ మేలుగాఁ దీర్చి
మృతిఁ బొంద లేనైతి మృగనేత్రి వినుము
వావిరిఁ బుట్టినవారికి నెల్లఁ

---

వేలఁగా, ఒరబుచుర్ = త్రోలుచు, వార్ధిజలము = సముద్రపునీరు, 'చు'ం యనన్ = చుం అని, ఇంకన్ గ్రోలి = ఇంకిపోవునట్లుత్రాఁగి, అడరెనో = తలపడెనో - సముద్రపునీళ్లంతయు త్రాగి తీఱఁగా పిదప లోకములనెల్ల చుట్టుక్రమ్మి నీఱు సేయుటకు బడబాగ్ని తలపడినదో యన్నట్లు, నభోమండలము = ఆకాశము, కార్చిచ్చు పుట్టినవిధ మెట్లనఁగా;- మొదటబిట్టుగా వాయువులు వీవఁగా చెట్లకొమ్మలు ఒరసికొనివేఁడిమిపుట్టి దానివలన చిఱునిప్పులు గలిగి యఃకాలాకుగుంపులంబడి రాఁజిచిన్నమంటలు పుట్టి యామంటలు కసవుజొంపములంబడి కాలిక్రమముగాపొదరిండ్లు రగులుకొని మండి చెట్లకుఁదగిలి పెనుజ్వాలలుగా చుట్టుక్రమ్ముకొన్నదయ్యెననుట. నెక్కొనన్ = కలుగఁగా, అక్కజంబు = మిక్కుటమైనది, అంకించి = పూని, నాపూనిననాఁటిమితికి = నేను ప్రతిజ్ఞచే

జావక పో రాదు చర్చించి చూడ
ధరణీశుఁ డగునాకు దర్ప మేర్పడఁగఁ
బరబలంబులు సొచ్చి బలువిడిఁ గడచి
వెస నురస్థలిఁ గాఁడి వీఁపున వెడలు
నిశితాస్త్రములఁ జచ్చి నెఱి నిందు నందు
వినుతి కెక్కుట మాని విన సైఁప రాని
వనవహ్నిఁ గాలంగ వలసె నీరీతి
నాతి నాదుర్మరణమునకు వగవ
బ్రాఁతి యైనట్టియీపట్టికి వగవ
గురుభక్తి మేకొని ఘోరాటవులకు
నరుదెంచి మనతోడ నలజడిఁ బొంది
కడపట నేఁ డిట్లు కాలాగ్ని చేత
సుడివడు మునితనూజునకు నే వగతు
నీమహాపాతకం బేమిటఁ బాయుఁ
గామిని నా కింక గతి యొండు లేదు
కన్నుల నీపాతకము గనుంగొనక
మున్నె యిచ్చెదఁ బ్రాణముల వహ్ని కనుచు
మనసులో శివు నిల్పి మంటకు నెదురు
చను చున్నయాహరిశ్చంద్రునిఁ జూచి
నిగుడుశోకము మది నిల్పి నవ్వుచును

---

సిననాఁటిగడువునకు, కాఁడి=దూసికొని, నిశితఅస్త్రములన్ = వాఁడిబాణములచే, బ్రాఁతి= గారాబు, పట్టి=బిడ్డఁడు, మేకొని=సమ్మతించి, సుడివడు=చిక్కుకొన్న -తబ్బిబ్బుపడు, మునితనూజునకున్ =మునికుమారునకు, నిగుడుశోకము=పయిపయి రేఁగుచున్నదుఃఖము, మదినిల్పి=మనస్సులో నేయడఁచి, నవ్వ

డెగువమ్రోఁ జంద్రమతీదేవి వలికె
'దేవ మీ కిట్లేల ధృతి దూలి పలుక
భావింప నసమానభాగ్యసంపదల
లలితమంగళసూత్రలక్ష్మి నిక్కముగఁ
దలఁచెదుచో నాకు దైవ మెంతయును
బగ గొని యిటు నగుఁబాటు గావింప
వగల నొక్కించుక వడి నిన్నుఁ బాసి
కడులోల నై యుండఁగా నెట్టు లోర్తు
జడియక పదివేలజన్మంబులందుఁ
బతి నీవ కాఁ గోరి పడి వహ్నిఁ గాలి
మృతిఁ బొంది పొందుదు మీఁద నీపొందు
సమ్మద మార నీచన విచ్చి నన్నుఁ
బొమ్మని యానతీ పోదు వే వేగ'
యనిన భుగాలున నడరుశోకాగ్ని
మనసు సుఱ్ఱు క్కని మను జేశుఁ డనియె
'జలజాక్షి నీకిట్టిసాహసకృత్య
మలవడ నోపునే యక్కటా నీవు
తొడిబడఁ జచ్చినతోడనే బెగడి

చుమ=దుఃఖాతిశయముపట్టలేకనవ్వుచును, లలితమంగళసూత్రలక్ష్మి=ఒప్పుచున్న మంగళసూత్రముయొక్క-సంపత్తిని-మంగళసూత్రపుబలిమి ననుట, నగుఁబాటు =నవ్వులాటసేయఁగా- నామంగళసూత్రము వ్యర్థముకానిదని తలఁచియుండఁ గా దైవమేయిట్లునన్ను అగడుసేయునేని యనుట, వగలన్ = దుఃఖములచే, సమ్మదమూ ఆరన్ =సంతోషమునిండఁగా, ఈచనవు = నేను ముందగ్నిలోఁబడి మృతిఁబొందెడిస్వాతంత్ర్యము, ఆనతీ=ఆనతిమ్ము, తొడిఁబడన్ = తొందర

విడివడఁ బ్రాణముల్ విడుచు నీశిశువు
సుతుఁడు నీవును జావఁ జూచి ప్రాణంబు
ధృతి నిల్పి యెట్లు వర్తింపఁగ వచ్చు
వచ్చునే నోరాడి వాక్రుచ్చి నిన్నుఁ
జిచ్చులోఁ బడు మని చెలఁగి వీడ్కొలుపఁ
గరుణ మాలినయట్టికఠినాత్ముఁడైన
నరునిఁ బల్కనిరీతి నయ మేది నన్నుఁ
బలికితి పలు'కని బాష్పపూరంబు
నెలమి ఱెప్పల నిల్పి యేఁగుచు నున్న
మనుజేశునకుఁ జంద్రమతి సాఁగి మ్రొక్కి
ఘనమైనభక్తితోఁ గరములు మొగిచి
'నలినాప్తకులనాథ నావిన్నవించు
పలుకు వేఱొకటిగా భావింప వలదు
దలముగా నలుదిశల్ దలకొని మండఁ
జలిచీమ కొఱవిపైఁ జనుదెంచినట్లు

పాటుతో, బెగడి=బెదరి, ధృతిఁ=ధైర్యముతో, నోరాడివాక్రుచ్చి=నోరు కదల్చి చెప్పి, 'నిన్ను...చిచ్చులోఁబడు మని నోరాడి వాక్రుచ్చి చెలఁగివీడ్కొలుపవచ్చునే' అని యన్వయము. కరుణ... ....నరునిఁ=దయలేక కఠిన హృదయుఁడైనమనుష్యునితోఁ జెప్పినట్లు, నయముఏది=మెత్తనవిడిచి, 'నన్నుఁ బలుకు పలికితి' అని అన్వయము, దలముగా ..చనుదెంచినట్లు = నలుప్రక్కల దట్టముగా కార్చిచ్చు క్రమ్ముకొని వచ్చుచుండఁగా చలిచీమ తప్పించుకొనుటకై నడుమనున్న యొకకొఱవిపైనెక్కి ప్రాఁకినట్లు నక్షత్రకుఁడు తమ్ము నండగొని యుదిఁగియున్నాఁడనుట. తమ్ము కొఱవిగా రూపించుటచే తాము నా కార్చిచ్చులో కొఱవివలెఁ గాలనుండుట సూచితము. చలిచీమ కొఱవి నాశ్రయించుట యెట్లువ్యర్థమో అట్లే కాలనున్నతమ్మాశ్రయించుటయు వ్యర్థమనుట, ఉలికి=భ.

వలయంబుగా మండి వచ్చు కార్చిచ్చు
కులికి యెందును వెళ్ల నుఱికి పో రాక
సుడి వడి మనలోనఁ జొచ్చి వాతెఱలం
దడుపుచు నున్నయీతపసికుమారుఁ
గొంకక వెస నెత్తుకొని వెర వైన
వంకగా నీవచ్చు వలయంబు గడపు
మీవు గల్గినఁ దీఱు నీమునిఋణము
నీవు గల్గినఁ గల్గు నెలఁతలపొందు
నీవు గల్గినఁ బుత్రనివహంబు గలుగు
నీవు గల్గినఁ గల్గు నిత్యసౌఖ్యములు
నీవు గల్గినఁ గల్గు నిత్యధర్మములు
నీవు గల్గినఁ గల్గు నిఖిలభోగములు
నీవు గల్గినఁ గల్గు నిత్యసంపదలు
నీవు గల్గినఁ గల్గు నిఖిలరాజ్యములు
నెడ లేదు భాషింప నిదె చేర వచ్చె
మిడుఁగుఱు లడరంగ మి న్నంది వహ్ని
తెగువ లే కున్నను దెగుట నిక్కంబు
సుగుణాత్మ తొలుత నేఁ జొచ్చినపిదప
భగవంతుఁ డొనరించుపద్ధతి జరుగు

---

యపడి, వెళ్లనుఱికి=వెడలదూఁకి, సుడివడి=తబ్బిబ్బుపడి, వాతెఱలు=పెద వులు, వెరవైనవంకగా=వీలయినదిక్కుగా, నివహము=సమూహము, ఎడలేదు భాషింపన్=మాటలాడుటకు అవకాశము లేదు, మిన్నంది=ఆకాశముముట్టి. మిక్కిలిపొడవుగాపెరిఁగియనుట, తెగువలేకున్నను తెగుటనిజంబు=సాహసము చేయనియెడల చచ్చుటనిశ్చయము, తొలుత......జరుగు=మొదట నేనన్ని

తగవు మీఱఁగఁ దెంపు దయ సేయు' మనుచు
వేఁడినఁ దల వ్రేల వ్రేసి నిట్టూర్పు
వేఁడి యై నృపతి నివ్వెఱ నూర కున్న
వసుధీశు నతిభక్తి వలగొని మ్రొక్కి
మసలక చనుచంద్రమతి వెంటఁ దగిలి
'యమ్మమ్మ నీ విపు డగ్నిలో నుఱుక
నమ్మదం బొదవంగఁ జనియెద వేని
వత్తు నేనును నన్ను వదలక తిగిచి
యెత్తికొ' మ్మనుచుఁ బె ల్లెసఁగు దైన్యమున
గిదుకుచుఁ జిన్ని కెంగేలఁ బైకొంగుఁ
గదియించి బుడిబుడి కన్నీరు దెచ్చి
మోహ మేర్పడఁ గుచంబుల మోము రాచు
లోహితాస్యునిఁ జూచి లోనన పొక్కి
యక్కునఁ గదియించి యౌదల నివిరి
చెక్కిలి నొక్కి యాచిన్నారిబొజ్జఁ
బుడికి చక్కిలిగింత పుచ్చి కన్నీరు
దుడిచి ముద్దులచుంచు దువ్వి మూర్కొనుచు
'నాయన్న సాకూన నాముద్దుపట్టి
మాయయ్య యీపేర్చుమంటఁ జల్లార్చి
వత్తు వేవేగ రావలదు నా తోడఁ
జిత్త మారఁగ నీకుఁ జేకూరు శుభము'

---

లోఁ బ్రవేశింపఁగా పిదప దైవము కావించుదారి కాఁగలదు, తెంపుదయ సేయుము= తెగువ చేసి యగ్నిలోఁబడుటకు అనుమతి యిమ్ము, నివ్వెఱ= మిక్కిలిభయము, వలగొని= ప్రదక్షిణము సేసి, కిదుకుచు= మెల్లగాశబ్దించుచు, చిన్ని కెంగేలన్ =

లని యెట్టకేలకు నాలోచితాస్యు
మను జేశుకడ నిల్పి మఱి యొండుదలఁపు
మది లేక నిల్చి యమ్మగువ ప్రాణేశుఁ
బదిలంబుగా మనఃపద్మంబునందు
ధృతి నిల్పి చంద్రమతీదేవి భక్తిఁ
బ్రతిముఖం బై యగ్నిభట్టారకునకుఁ
దరుణప్రవాళసుందర కాంతిఁ దనరు
కరపల్లవంబులు గర మొప్ప మొగిచి
'వరద వైశ్వానర వరదయాలోల
దురితసముత్కరతూలవాతూల
మదిలోన వాక్కున మఱి చేతలందు
వదలక పతిభక్తి వఱలుదు నేని
నరలోకనుతుఁ డైన నాకూర్మివిభుఁడు
పరమసత్యంబు దప్పక మను నేని
పరమశీతలుఁడ వై ప్రాణదానంబుఁ
గరుణమైఁ దొలుత నక్షత్రున కొసఁగి
మునినాథుఋణమున మునిఁగి పోకుండ
మనుజేశుఁ గొడుకును మఱి కావు' మనుచుఁ
జెచ్చెర రాయంచ చెంగల్వకొలనుఁ
జొచ్చినగతిఁ జిచ్చుఁ జొచ్చి యానడుమఁ

---

సొగసైనచిన్నయొఱ్ఱనిచేతితో, తరుణప్రవాళసుందరకాంతిన్ = లేఁతచిగుళ్ల వంటిసొగసైనకాంతితో, దురిత...తూల- దురితసముత్కర = పాపసమూహము నెడి, తూల = దూదికి, వాతూల = గాలియైనవాఁడా - గాలి దూదిని పింజెలుగా నెగురఁగొట్టునట్లు పాపసమూహమును నాశముసేయువాఁడాయనుట, కలుగు

గలయఁ బూసినకింశుకంబులలోనఁ
జెలువారు చున్నరాచిలుకచందమునఁ
బ్రబలసంధ్యారాగపటలంబునందు
సొబ గొందు క్రొన్నెలసోగబాగునను
మలసి మండెడు పెనుమంటలలోన
నిలిచి మైఁదీఁగెకాంతికి వన్నె నిగుడ
దీపింప రానిపాతివ్రత్యమహిమ
కేపార వెఱఁ గంది యెల్ల దేవతలుఁ
బోరిఁ బోరి నుతియింపఁ బువ్వులవాన
గురిసె నప్పుడు వహ్ని గొబ్బున నడఁగ
నిగుడుకీలలు మాని నివుఱు పైఁగప్పి
పొగులుట లుడిగి నిప్పుకలు సల్లారె
నావిధంబునను దావాగ్ని సల్లారి
పోవుటయును మహాద్భుతముగా మెఱసి
తలపువ్వు వాడక తరుణీలలామ

---

బూసినకింశుకములు-అంతటనువ్యాపించి పూఁచియున్న మోదుగుచెట్లు, ప్రబల... పటలమునందు = దట్టమైన సంజకెంజాయలసమూహమునందు, సొబగు ఒందు= అందగించునట్టి, క్రొన్నెలసోగబాగునను=లేఁతయై నిడుదగానున్న చంద్రరేఖవిధమున - ఇట చెంగల్వకోలను, పూచినమోదుగుచెట్లు, దట్టంపుసంజకెంజాయలు అగ్నికిని, రాయంచ, రాచిలుక, క్రొన్నెలసోగయనునివి చంద్రమతికిని జెప్పినాఁడని తెలియునది. మైదీఁగె...నిగుడ-తీఁగవంటి మేనికాంతికి యాయగ్నియందు మఱింతకాంతి హెచ్చఁగా, నిగుడుకీలలన్ = సాఁగుచున్నజ్వాలలను, నివుఱు పైఁగప్పి=మండుటతీసి పైని నివుఱుగ్రమ్మి, పొగులుట=కుములుట. తలపువ్వువాడక=తలయందలి పువ్వుసైతము కందక-ఇంచుకైనను కసుగందక

యెలనవ్వు సిగురొత్త నెప్పటి యట్టు
లలవడఁ జేతు లల్లార్చుచు నెదుర
నలరి యానందనృత్యముఁ జూపు చున్న
యాలోహితాస్యుని నక్కునఁ జేర్చి
పాలు చన్నులఁ జేఁపి పయ్యెద దడియ
జడిగొని హర్షాశ్రుజలముల మేనిఁ
దడిపి ముద్దాడుచు ధవునకు నర్థి
నిలఁ జాఁగి మ్రొక్కిన 'నింతి నీ యట్టి
కులసతి నాకుఁ గల్గుటఁ గాదె యిట్టి
యాపద లెడఁబాసి యలరంగఁ గలిగె
నీపుణ్యవర్తన నెగడె లోకముల
నే రట్టుఁ దిట్టు నా కెనఁగక యుండ
బోరన మునిపుత్రుఁ బ్రోచితి గాన
నీనిమిత్తంబున నెలఁత నా కింకఁ
బూని కౌశికుఋణంబును దీర్పఁ గలుగు'
నని యుచితోక్తుల నమ్మహీవిభుఁడు
తనదేవి ప్రియ మారఁ దగ గారవింప
నప్పు డాకౌశికుం డవ్విధం బెల్లఁ
దప్పక వీక్షించి తద్దయు నలిగి
'కాలాగ్నిఁ బోనియీకార్చిచ్చుచేతఁ
గాలి వే భస్మంబు గాక తా నిలిచి
పతియును దాను నెప్పటియట్ల కలసి
సుతుని ముద్దాడుచు సురలు నుతింప

---

యనుట-ఇది భాషాశైలి, ఎలనవ్వు=చిఱునవ్వు, రట్టు=అపవాదము, సీమంత

నున్నది కళ్యాణి కొక్కింత నైనఁ
జెన్నఱి యుండదు సీమంతవీథి
యలికంబు సెమరింప దలకలు గమర
వెలనవ్వు గడివోవ దెసఁగదు దప్పి
చిలుకదు కన్నీరు జిగి దప్పి మేను
సొలయ దేమియుఁ బొగచూరదు వలువ
పసిమి దప్పదు కమ్మపసపు లేఁబూఁత
కసుగంద వడుగులుఁ గమరవుఁ జేతు
లీతగ వీతెంపు నీవెంపు సొంపు
లీతెఱం గీమేర లీదిట్టతనము
లెందు మహాశ్చర్య మేమన వచ్చు
నిందుకళాధరుం డెఱుఁగు నొక్కరుఁడు
బాపురే నా తపోబలమునకంటె
దీపించు దీనిపాతివ్రత్యమహిమ
పతిభక్తి సతులకుఁ బరమశీలంబు
పతిభక్తి సతులకు భాగ్యమూలంబు
పతిభక్తి సతులకుఁ బరమభూషణము
పతిభక్తి సతులకు భాగ్యపోషణము
పతిభక్తి సతులకు భయనివారణము

---

వీథి=పాపటరేక, అలికము=నెత్తి, అలకలు=ముంగురులు, కమరవు=కాలవు, కడివోవదు = వాసనపోవదు-చెడిపోదు. చిలుకదు = తొరఁగదు-కన్నీరు కాఱదనుట. సొలయదు=బడలదు, పొగచూరదు వలువ=వస్త్రము మాఁడి పొగయదు, కమ్మపసపు లేఁబూఁత=మంచిపసపు పలుచగాఁబూసినపూఁత, కసుగందవు=కొంచెమైనను వాఁడవు, ఇందుకళాధరుఁడు =శివుఁడు, బాపురే =

పతిభక్తి నిఖిలశోభనకారణంబు
పతిభక్తి నింతికిఁ బడయంగ రాని
యతులితపుణ్యంబు లవి యెందుఁ గలవు
వెఱపింపఁ బోయి తా వెఱచినయట్టి
తెఱఁగయ్యె నింక నే తెఱఁగిట మీఁద'
నని తలపోసి హా యని వెచ్చ నూర్చి
మౌనమునఁ జలముఁ గ్రమ్మఱ నూలుకొల్పి
యడరెడు తనరూప మన్యు లెవ్వరికిఁ
బొడ గాన రాకుండఁ బొందుగాఁ గదిసి
వక్షంబు మోము మోవఁగఁ గౌఁగిలించి
నక్షత్రకునకుఁ దిన్నఁగ నిట్టు లనియెఁ
'జయ్యన బహువేదశాస్త్రపారీణు
లయ్యున్న నా శిష్యు లందఱిలోన
వెలయునష్టాదశవిద్యలయందు
బలవంతుఁ గావించి పాటింతు నిన్ను
నేచందమున నైన నీ వధూమణికి
నీ చక్రవర్తిపై నెనఁగినకూర్మి
వీడి పోవఁగఁ బల్కి విరిపోటు సేసి
జోడుఁ బాపుము దాన సురసమై జరుగుఁ
గైకొని నాసేయుకపటకృత్యములు

---

సెబాసు, వెఱపింపఁబోయి... తెఱఁగయ్యె- ఒకరిని భయపెట్టఁబోయి తుదకు తానే భయపడినట్లు, చలము=హఠము, మోము మోవఁగఁగ = మొగము వఱకు- మోమును వక్షమును ఒండొంటికి తగులునట్లుగా, విరిపోటు= వీడ్పాటు-ఎడబాటు, జోడు=జంట 'దాన నాచేయుకపటకృత్యములు సురసమై జరగ

లేకున్నఁ గొన సాఁగ లేవు నిక్కువము
సేయు మీపని కార్యసిద్ధి నా కొదవు
పోయి వచ్చెద'నని పోయె నమ్మౌని
యంత నక్షత్రకుం డామహారాజు
కాంతాశిరోమణిఁ గాంచి దీవించి
"దేవి నీ దైనపాతివ్రత్యమహిమ
వేవేలదెఱఁగుల వినుతింప నరిది
యనలకీలావళి కాహుతి యైన
ననుఁ బ్రాణములు గాచి నయమునఁ బ్రోచి
తీక్షితి స్త్రీలలో నెన్నఁగా మొదలి
పక్ష మేర్పడఁగ లోపాముద్ర నెన్ని
యాయరుంధతిఁ జెప్పి యనసూయఁ బొగడి
శ్రీ యలరార శచీదేవిఁ దలఁచి
యలవడఁ గొనియాడ నగుఁ గాక యున్న
పొలఁతులు నీతోడఁ బురుడింపఁ గలరె
కరుణమై నీ యుపకారంబు నాకుఁ
బరఁగఁ జేసిననీకుఁ బ్రత్యుపకార
మొనరఁ గావించెద నొకమాట వినుము
చనవుమైఁ గౌశికసంయమి వేఁడి

---

ననియన్వయము. సురసమై=మిక్కిలి రసవంతముగా, అనల కీల ఆవళికిన్=అగ్ని జ్వాలలవరుసకు, ఆహుతి=బలి, మొదలిపక్షము=మిక్కిలి మేలయినతరగతి, ఏర్పడఁగాన్=తేటపడునట్లు, మొదటఅరుంధతి మొదలుగా శచీదేవివఱకుఁ గలపతివ్రతల నెన్ని వారితో పాటిగా నిన్నును ఎన్నవలయునుగాని, ఉన్న పొలఁతులు = తక్కయున్న కేవల స్త్రీలు, పురుడింపన్ = సరిపోల,

క్రమ్మఱ నాకుఁగాఁ గైకొని రాజ్య
మిమ్ముల నీ కిచ్చి యీ లోహితాస్యుఁ
బట్టంబు గట్టింతుఁ బరఁగ నీ ముద్దు
పట్టిఁ దోడ్కొనుచు నీ పట్టణంబునకు
రమ్ము నీ కిది పొందు రాదన వలదు
నమ్ముము మృష గాదు నా మాట లతివ
యెలమిమై నటు గాక యీరాజు వెంట
నలయక వర్తింప నాశించె దేని
వనహుతాశనమహాజ్వాలాకరాళ
ఘనతరవిస్ఫులింగముల నంగములు
గమరక పోవచ్చుఁ గాక కల్పాంత
డమరు నిష్ఠుర ఢమఢమ రవ స్ఫురిత
పటుతర బ్రహ్మాండ భాండ చండీశ
చటుల రౌద్రాకృతి సమకొనఁ బేర్చు

---

**కౌశికసంయమి** = విశ్వామిత్రమునిని, 'నాకుఁగా రాజ్యము క్రమ్మఱఁ గైకొని నీ కిమ్ములనిచ్చి' అని యన్వయము, పొందుగాదు=ఉచితము గాదు. మృష=కల్ల, వన...హుతాశన...విస్ఫులింగములన్ - వనహుతాశన = అడవినిప్పుయొక్క, మహాజ్వాలా= గొప్పమంటలయొక్క, కరాళ = భయంకరములైన, ఘనతర విస్ఫులింగములన్ = మిక్కిలిగొప్పవైన మిడుఁగుఱులచేత, కల్పాం...రౌద్రాకృతి-కల్పాంత=ప్రళయమందలి, డమరు=డమరువాద్యముయొక్క, నిష్ఠుర= కఠోరమైన, ఢమఢమరవ=ఢమఢమయనుశబ్దముచేత, స్ఫురిత=అల్లలార్పఁబడిన, పటుతర=మిక్కిలిపటువైన, బ్రహ్మాండభాండ = కుండలవంటి బ్రహ్మాండములుగలవాఁడైన-తనడమరు మ్రోఁతలచేత బ్రహ్మాండముల నల్లలార్చువాఁడైన యనుట, చండీశ-శివునియొక్క, చటుల=మిక్కుటమైన, రౌద్రఆకృతి=భయంకరమైన ఆకారము, సమకొనన్=జతపడునట్లుగా, కుటిలకౌశిక= వంచకుఁడైన

కుటిలకౌశికుతీవ్రకోపాగ్నిశిఖలఁ
బెట పెటఁ బ్రేలక ప్రిదిలి పో వశ మె
యదియును గాక నేఁ డాదిగా నింకఁ
బదిదినంబులు సిక్కెఁ బలికినమితికి
మునినాథుధన మెట్లు ముందటఁ జెల్లు
వెనుకఁ జెల్లిన దటువీసంబు లేదు
లే దుపాయం బింక లేశమాత్రంబు
మేదినీపతి కిట మీఁద నూహింప
నొదవుపేరాఁకట నుదరి హు మ్మనుచుఁ
గదియుబెబ్బులివలెఁ గౌశికుఁ డలిగి
తడయక వచ్చి మాధనముఁ దె మ్మనుచు
నడిగి యఱ్ఱాని బి ట్టదలించె నేని
కడువడి గర్భంబు గదలి కంపించి
సుడివడి నిన్ను నీ సుతుని నక్కఱకుఁ
బోయినంతకు నమ్మి పుచ్చు భూవిభుఁడు
తోయజానన నాకుఁ దోఁచినబుద్ధి'
నావుడుఁ జిఱునవ్వు నవ్వి యారాజు
దేవి నక్షత్రకు దెసఁ జూచి పలికె
'సతి కేడుగడయును జర్చింపఁ బతియె

విశ్వామిత్రునియొక్క, పెటపెటఁబ్రేలక = పెటపెటమని మాఁడక, ప్రిదిలిపోన్ = జాఱితప్పించుకొనిపోవుటకు, నేఁడాదిగాన్ = నేఁడు మొదలుకొని, చిక్కెన్ = మిగిలెను, మితికిన్ = గడువునకు, ముందటన్ = ఇఁకమీఁద, వెనుకన్ = ఇంతకు ముందు, ఉదరి=చలించి, అఱ్ఱు ఆని= మెడపట్టుకొని, సుడివడి = తబ్బిబ్బుపడి, అక్కఱకున్ = ఆవశ్యకతకు-లేక - ఆవశ్యకకార్యమునకు, ఏడుగడ=స్వామి,

పతియ చూ దైవ మెబ్బంగుల సతికి
బలవంత మగువిధి ప్రాణేశుఁ బాప
వలవంతఁ జెందినవరవధూమణికి
భారంబు హారంబు భాసురగంధ
సారం బసారంబు సారకాసార
తీరంబు దూరంబు తీవ్రసల్లాప
కీరంబు క్రూరంబు కిన్నరమంజు
నాదంబు ఖేదంబు నవచంద్రకాంత
వేదులు సూదులు విరచితోద్యాన
చూతంబు భూతంబు సురభికస్తూరి
పూఁతలు రోఁతలు పూర్ణచంద్రికల
మెఱపులు వెఱపులు మెత్తని దూది
పఱుపులు మఱుపులు పరభృతసమితి

---

చర్చింపన్=విచారింపఁగా, పాపన్=ఎడఁబాపఁగా, వలవంతన్=దుఃఖమును, వరవధూమణికిన్ = ఉత్తమురాలైన స్త్రీరత్నమునకు, హారము, భారంబు = బరువు, భాసురగంధసారంబు=మనోజ్ఞమైనచందనము, అసారంబు=పసలేనిది, సార కాసారతీరంబు=శ్రేష్ఠమైనసరస్సుయొక్కగట్టు,దూరంబు=దవ్వయినది-పోవనొప్పనిది,తీవ్రసల్లాపకీరంబు=వడిగలపలుకులుగలచిలుక, క్రూరంబు=కటువైనది,కిన్నరమంజునాదంబు= కిన్నెరవీణయొక్కయింపయినధ్వని, ఖేదము= దుఃఖము-దుఃఖకరమనుట. నవచంద్రకాంతవేదులు = క్రొత్తలైన చంద్రకాంత శిలలయరుఁగులు,సూదులు=సూదులవలె నొప్పించునని, విరచిత ఉద్యానచూతము=చక్కఁగా నేర్పఱుపఁబడిన ఎలతోఁటయందలి మామిడి,భూతంబు=భూతమువలె భయంకరమైనది, సురభి కస్తూరి పూఁతలు=వాసనగల కస్తురిపూఁతలు, రోఁతలు= అసహ్యములు, పూర్ణచంద్రికల మెఱపులు=పండువెన్నెలప్రకాశములు, వెఱపులు=భయంకరములు, మఱపులు=మఱపునకుపాత్రములు- మఱ

కూఁతలు ఘాతలు గొదమతుమ్మెదల
మ్రోఁతలు వ్రేఁతలు ముద్దురాయంచ
మురువులు పరువులు మోహంపుఁజెలుల
సరసముల్ విరసముల్ చందనానిలపు
మెలఁకువ యలఁకువ మేల్మిచెంగావి
జిలుగులు సిలుగులు చివురుఁజప్పరపుఁ
బొంతలు వింతలు పూఁబొదరిండ్ల
క్రంతలు వంతలు కమనీయసరసి
బిసములు నుసములు పృథుమకరంద
రసములు విసములు రమ్యహిమాంబు
పూరంబు గాదు కర్పూరంబు సేఁదు
వీరుండు మారుఁ డీవిధమును గాక
ముదమునఁ గులశీలములు మదిఁ గోరి

---

చిపోవఁబడునవియనుట, పరభృతసమితి = కోవెలలసమూహము, ఘాతలు=దెబ్బలు-దెబ్బలవలెగడుపైనవి, వ్రేఁతలు=దెబ్బలు, మురువులు=నడలమురిపములు, పరువులు=పరుగెత్తిపోవునవి-దూరముగా పలాయితములగుననుట, చందనఅనిలపు=చందనపుఁగొండనుండి వీచుగాలియొక్క, మెలఁకువ=సంచారము-వీచుట, అలఁకువ=ఆయాసము-ఆయాసకరమనుట-జిలుగులు = సన్నవస్త్రములు, సిలుగులు=ఉపద్రవములు, చివురు చప్పరపు పొంతలు=చిగురుటాకులతోఁ పన్నినచాకపుపందిరియొక్క సమీపములు, వింతలు= ఆశ్చర్యము-అనుభవించుటయరుదనుట, క్రంతలు=రచ్చలు-స్థానములనుట, వంతలు=దుఃఖములు-దుఃఖకరములనుట. కమనీయసరసి=మనోహరమైనకొలనుయొక్క, బిసములు=తామరతూండ్లు, నుసములు=కనరులు, పృథుమకరందరసములు=గొప్ప పూఁదేనెద్రవములు, రమ్యహిమాంబుపూరంబు=మేలైన పన్నీటిముంపు, కాదు=ఇష్టముగాదు, మారుఁడు వీరుండు=మన్మథుఁడో పరాక్రమశాలి-పురుషునిఁ బాసిన స్త్రీకి మన్మథునిపరా

బ్రదుకుపతివ్రతారత్నంబులకును
బతి లేనిరాజ్యసంపద లవి యేల
పతి లేనిసుతు లేల బంధువు లేల
పతి లేనిహితు లేల ప్రాణంబు లేల
మతిఁ దలపోయ నీ మానవేశ్వరుఁడు
నా కూర్మి నిలుకడ నా తోడునీడ
నా కన్న పెన్నిధి నా నోముఫలము
నా మేలిచెలికాఁడు నా పట్టుఁగొమ్మ
నా మెచ్చువలరాజు న న్నేలురాజు
చిక్కనే కౌశికుచిక్కులఁ దగిలి
వెక్కురువడుగ యీ వెడమాట లుడుగు
నీవు నీ గురుఁడును నిఖిలనిర్జరులు
వేవేలదెఱఁగుల వినుతులు సేయ
జగ మెఱుంగఁగ హరిశ్చంద్రభూవిభుఁడు
నెగడుసత్యవ్రతనియతిఁ బెం పొంది

---

క్రమమునోర్చుట కష్టమనుట, ఈవిధమునుగాక = ఈప్రకారమే కాక - అనఁగా నింతవఱకుపతినిబాసిన స్త్రీకి వలపుచేఁగలుగునట్టిబాధలు చెప్పియిప్పుడు పాతివ్రత్యధర్మమునుబట్టి కలుగు నభోగ్యములను జెప్పుచున్నది, నాకూర్మినిలుకడ = నాప్రేమము ఎడతెగక నెలకొనియుండు స్థానము, నాతోడునీడ = నన్నుతోడు నీడవలె నెడఁబాయనివాఁడు, నాకన్న పెన్నిధి = నాకుదొరకిన పెద్దలిబ్బి - పెద్ద నిధివలెనాకుఁ బెంపుసొంపులన్నియుఁ జేయువాఁడు, నానోముఫలము = నేను నోఁచిననోములకు ఫలముగానుండువాఁడు, నా మేలిచెలికాఁడు = నాకు మేలయినస్నేహితుఁడు, నాపట్టుఁగొమ్మ = నాకు అధారభూతుఁడు, నామెచ్చువలరాజు = నేను మెచ్చిన మన్మథుఁడు, 'కౌశికు చిక్కులఁ తగిలి చిక్కనే' అని యన్వయము. కౌశికుఁడు పెట్టుసంకటములందుఁ బడియు నియమముతప్పఁ

వెలయ నష్టాదశద్వీపసంధులను
నెలమిమైఁ గ్రమ్మఱ నేలు నిక్కముగ'
ననుటయు 'నిది తథ్య' మని వినువీథి
నను వ్రెంద భాషించె నశరీరవాణి
యది విని మదిని నత్యాశ్చర్య మంది
కొదుకుచు నక్షత్రకుం డూరకుండె.

ప్రథమభాగము సమాప్తము.



---

డనుట, వెడమాటలు=పిచ్చిమాటలు, నిఖిలనిర్జరులు=సమస్తదేవతలు, నెగడు సత్యవ్రతనియతిన్ = ప్రకాశించుచున్న సత్యమేపలికెడి నియమముయొక్క నిలుకడచేత, పెంపు=ఐశ్వర్యము, కొదుకుచున్=సంకోచించుచు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## ద్విపద

### ద్వితీయ భాగము.

మనుజేశు డంత నమ్మగువ నీక్షించి
'మనకు నేఁ డిచ్చోట మసలుట దగదు
ముందఱ నున్నది ముయ్యేఱు నేల
యం దున్నజనులు మహాజను' లనిన
వనిత యి ట్లనుఁ బ్రాణవల్లభుఁ జూచి
'పెను పొందుతత్త్వరిపే రేమి దేవ
యొనరంగ నేలెడియొడయుఁ డెవ్వాఁడు
మన కెవ్వ రందు సంబంధబాంధవులు
మనయప్పు తెగటార్ప మది వేఁడువారి
వినిపింపు వారల విమలాత్మ' యనినఁ
జందనగంధి కాజననాథుఁ డనియె
'నిందుకళాధరుం డేలు నప్పురము
నావిశ్వనాథుఁడే యాత్మబాంధవుఁడు
దైవంబుఁ ద్రాతయు దాతయు మనకు

---

ముయ్యేఱు నేల='త్రిస్రోతాః' అన్నట్లుమూఁడుప్రవాహములుగా గంగానదిప్రవహించు స్థలము, మహాజనులు=గొప్పవారు-పుణ్యాత్ములనుట,ఒనరంగన్=ఒప్పట్లుగా,ఒడయఁడు=ఏలిక-ప్రభువు, ఇందుకళాధరుఁడు=శివుఁడు, త్రాత=

నగలక మునినాథునవ్వన కొక్క
తెఁగసేయ వలయు నో దేవి యెట్లైన
నని కుమారునిఁ దనయంస మెక్కించు
కొని యట పోవుచోఁ గొంత దవ్వులకు
నరుణారవిందంబు లడుగులు గాఁగ
దరుల గ్రుమ్మరువనదంతావళముల
యురుతరతుండంబు లూరులు గాఁగ
సరససైకతసీమ జఘనంబు గాఁగ
సురుచిరం బగుమేటిసుడి నాభి గాఁగ
గరమొప్పుచిఱుతరఁగలు వళుల్ గాఁగ
నునుఁదీఁగనాచు లేనూఁగారు గాఁగ
నెనయ జక్కవలు పాలిండ్లును గాఁగఁ
జెలువంపుబిసములు సేతులు గాఁగ
వెలిదమ్మి వదనారవిందమ్ము గాఁగఁ
గలికిబేడిసలు వాల్గన్నులు గాఁగ
నెలకొన్నజలవేణి నెఱివేణి గాఁగ 30

---

రక్షకుఁడు, అగలక=వెనుదీయక, తెఁగ=విధము, అంసము=మూఁపు, అరుణఅరవిందంబులు=ఎఱ్ఱదామరలు, దరులన్=గట్టులందు, వనదంతావళములు=అడవిఏనుఁగులయొక్క, ఉరుతరతుండములు=మిక్కిలి గొప్పవైన తొండములు, ఊరులుగాఁగన్=తొడలుకాఁగా, సరససైకతసీమ=ఒప్పిదమైనయిసుకదిబ్బపట్టు, జఘనము=కటి, సురుచిర=అందమైన, మేటి=గొప్ప, చిఱుతరఁగలు=చిన్నయలలు, వళుల్=కడుపుమీఁదిముడుతలును, నునుఁదీఁగనాచు=నిద్దమైనపాఁచితీఁగ, లేనూఁగారు=లేఁతయైననూఁగారు, చెలువంపుబిసములు= అందమైనతామరతూండ్లు, వెలిదమ్మి=తెల్లదామర, కలికిబేడిసలు= ప్రకాశించుచున్న బేడిసచేఁపలు, వాల్గన్నులు=నిడుదలైనకన్నులు, నెలకొన్నజలవేణి = నిశ్చలముగానున్న నీటి

సరవిఁ బెల్లెసఁగెడు జలకణ పంక్తు
లరు దారుమౌక్తికహారముల్ గాఁగ
నవలఁ గ్రీడించు రాయంచలరవము
నవహేమనూపురనాదంబు గాఁగఁ
బెనుపొంద నెరసిన ఫేనంబు దెలుపు
దనరారు చున్న చందనచర్చ గాఁగఁ
గూలావనీరుహకుసుమపరాగ
జాలంబు చిత్రవస్త్రంబుగా మెఱయ
జనలోకపావని జాహ్నవి గంగఁ
గనుఁగొని హస్తపంకజములు మొగిచి
నుదుటఁ గీలించి సన్నుతు లొప్ప భక్తిఁ
గదిసి నందనుఁడును గాంతయుఁ దాను
నాపుణ్యవాహినియం దవగాహ
మొప్పిఁ గావించి యుచితాహ్నికములఁ
గ్రమమునఁ దీర్చి యక్కడఁ గొంత సేపు
శ్రమము దీరఁగ నిల్చి జననాథతిలకుఁ

వెల్లువ, నెఱివేణిగాఁగఁ =నిండారుజడగాఁగా, పెల్లు=మిక్కిలిగా, జలకణపంక్తులు=నీటిబొట్లవరుసలు, అరుదారుమౌక్తికహారముల్ = వింతయైనముత్తెపుసరులు, నవహేమనూపురనాదము=క్రొత్తబంగారంఁదియచప్పుడు, పెనుపు=పెంపు, నెరసిన ఫేనంబు దెలుపు=వ్యాపించిన నురుఁగుతెల్లఁదనము, చర్చ=పూఁత, కూలా...జాలము- కూల=గట్టునందలి, అవనీరుహ=చెట్లయొక్క, కుసుమపరాగ=పుప్పొడియొక్క, జాలంబు=సమూహము, గంగనుఇంతవఱకొక స్త్రీగావర్ణించినాఁడు. జనలోకపావని = భూలోకమును పవిత్రముచేయునది, జాహ్నవి - జహ్నుమునివలనఁబుట్టినది, నందనుఁడు=కొడుకు, పుణ్యవాహిని = పవిత్రమగునది, అవగాహము=స్నానము, ఉచిత ఆహ్నికముల = తగినట్టిపగటికర్మములను,

డట చని ముందట నా వేల్పుటేటి
తటమున నురుతరద్వారకవాట
వాపీతటాకోపవనసముత్తుంగ
గోపుర ధ్వజ మణి కుడ్య విచిత్ర
తోరణ ప్రాసాద తురగ మదాంధ
వారణ రథ భట వ్రాత సామగ్రిఁ
జెన్నొందు చున్న కాశీపురిఁ జేరి
కన్నులు విలసిల్లఁగా మహీవిభుఁడు
ముదమునఁ దన దేవి మోహము వీక్షించి
మదిరాక్షి యిందులమహిమ వర్ణింపఁ
బదినూఱుముఖములఫణియును జాలఁ
డిది వేదవిఖ్యాత మిది ముక్తిమార్గ
మిది స్వర్గసోపాన మిది సిద్ధసేవ్య
మిది దోషచయదూర మిది తీర్థసార
మిది భుక్తిముక్తిద మిది సత్యచరిత

---

వేల్పుటేటితటము - దేవనదియైనగంగగట్టు, ఉరుతర... సామగ్రిక్ - ఉరుతర = మిక్కిలిగొప్పవైన, ద్వారకవాట = ద్వారపుతలుపులును, వాపీ = నడబావులును, తటాక = చెఱువులును, ఉపవన = తోఁటలును, సముత్తుంగగోపుర = పొడవైన గోపురములును, ధ్వజ = ధ్వజములును, మణికుడ్య = రత్నమయమైనగోడలును, విచిత్ర = వింతలైన, తోరణ = ముఖద్వారములును, ప్రాసాద = మేడలును, తురగ = గుఱ్ఱములు, మదాంధవారణ = మదముచే కన్నుఁగానని యేనుఁగులు, రథ = రథములును, భటవ్రాత = బంట్లసమూహములును, సామగ్రిక్ = వీనియొక్క సంపూర్ణతచేత, దోషచయదూరము = దోషసమూహములకుదవ్వయినది - దోషములనెల్ల పోఁగొట్టునది. తీర్థసారము = శ్రేష్ఠమైనతీర్థము. భుక్తిముక్తిదము = భోగమోక్ష

మిది శంకరక్షేత్ర మిట్టిచిత్రంబు
కంతునికోఅ రోసి కన్నులు మూసి
చింత లోక్కటిఁ జేసి శివుఁ దలపోసి
యల సంతతోల్లాస మందెడువాసి
గలిగించునీకాశి ఘనపుణ్యరాశి
వామాక్షి విప్రుని వధియించునతఁడు
కామాంధుఁడై తల్లిఁ గదిసినయతఁడు
నుడుగక సురఁ ద్రాగు చుండెడునతఁడుఁ
దొడరి సువర్ణంబు దొంగిలునతఁడు
వనితల శిశువుల వధియించునతఁడుఁ
గినుకమై ధేనువుఁ గెడపినయతఁడుఁ
గొండీఁడు గృహదాహకుఁడు గరదుండుఁ
జండాలు డఖిలదూషకుఁడును మఱియుఁ
గ్రిమి పశు మృగ పక్షి కీటాది జంతు
సముదాయ మైన నిచ్చట మృతిఁ బొంది
మిన్నేఱుజడలును మిక్కిలికన్నుఁ
గ్రొన్నెలపువ్వును గుత్తుకనలుపుఁ
బులితోలు కాసెయుఁ బునుకకంచంబు

ములనొనఁగునది. కంతునికోఅ=మన్మథునితక్కువ, సంతతఉల్లాసము=ఎడతెగని యానందము, వాసి=మేలిమి-ఆధిక్యము, సుర=కల్లు, సువర్ణము=బంగారు, కెడపిన=చంపిన, కొండీఁడు=కొండెము చెప్పువాఁడు, గృహదాహకుఁడు=ఇంటికి నిప్పు పెట్టెడువాఁడు, గరదుండు=విషము పెట్టెడివాఁడు, అఖిలదూషకుఁడు=అందఱిని దూషించువాఁడు, మిన్నేఱుజడలు=ఆకాశగంగగలజడలు, మిక్కిలికన్ను=మూఁడవకన్ను, క్రొన్నెలపువ్వంబు=క్రొత్తచందురుఁడనెడితలపువ్వును, కుత్తుకనలుపు=గొంతునందలినీలిమ. పునుకకంచము=తలపుఱ్ఱపాత్ర. వలుఁద=వెడలు

వలుఁదశూలము నస్థి వనమాలికయును
గలయిత డాత డై కమనీయరత్న
కలిత మై తలఁచినకడలనే మెలఁగు
నతులవిమానంబు నందు దన్నెలమిఁ
బ్రతిదినంబును ససంభ్రమముగాఁ గదిసి
యొనపరివన్నెలు నోరచూపులును
ముసిముసినగవులు మొగడచన్నులును
నసియాడునడుములు నలసయానములు
రస మొల్కుబింబాధరంబులుఁ గలిగి
యలరువిల్తుని మోహనాస్త్రంబు లనఁగ
నలరారురుద్రకన్యాసహస్రములు
వివిధభంగులఁ గొల్వ వినుతికి నెక్కి
శివలోకమున సుఖస్థితి నుండఁ గాంచు
ననుచుఁ జిత్రంబుగా నచ్చటిమహిమ
మన మార నాచంద్రమతికిఁ జెప్పుచును
ధవళగోపురచతుర్ద్వారబంధురము

---

అస్థివనమాలిక=ప్రేవులమాల, ఇతఁడు ఆతఁడై = ఇచట మృతిఁబొందినవాఁడు శివునిలక్షణములను బొంది ఆశివుఁడేయై—శివసారూప్యమును బొందియనుట, కమనీయరత్నకలితము=మేలయినమణులతో పొదుగఁబడినది, తలఁచినకడలనే = తలఁచుకొన్నచోట్లనే, ఒనపరి వన్నెలు = సింగారపువగలు, మొగడచన్నులు=మొగ్గలవంటిపాలిండ్లు, అసియాడు=జవ్వాడు, అలసయానములు= మెల్లనినడలు, బింబాధరములు=దొండపండువంటి పెదవులు, అలరువిల్తుని మోహనాస్త్రములు = మన్మథుఁడు జగత్తును మోహింపఁజేయుటకై వేయుబాణములు, ధవళ...బంధురము—ధవళగోపుర=తెల్లనిగోపురములచేతను, చతుర్ద్వార=

ప్రవిమలముక్తాతపత్రసుందరము
నరుణవితానరమ్యమును సమీర
తరళితవృషభకేతనభాసురంబు
మణిరంగవల్లికామంటపోజ్జ్వలము
ప్రణుతగుగ్గులుధూపపటలవాసితము
పటహ భేరీ శంఖ పణవ మృదంగ
పటు ఘంటికానేకబహువాద్యరవము
కాంతాసమర్పితకర్పూరశకల
కాంతనీరాజనకాంతి శోభితము

---

నాలుగు హజారముల చేతను, బంధురము=మనోజ్ఞమైనది. ప్రవిమల...సుందరము—ప్రవిమల=మిక్కిలి తెల్లనైన, ముక్తా ఆతపత్ర = ముత్యపుగొడుగు చేత, సుందరము=అందమైనది, అరుణవితానరమ్యము = ఎఱ్ఱని మేలుకట్లచే సొగసైనది, సమీర...భాసురంబు—సమీర = గాలిచేత, తరళిత = కదల్పఁబడిన, వృషభ కేతన=ఎద్దుపడగ చేత, భాసురము=మనోజ్ఞమైనది. మణి...జ్వలము—మణి=రత్నముల చేతనైన, రంగవల్లికా = ముగ్గులతోఁ గూడిన, మంటప = మంటపములచే, ఉజ్జ్వలము=ప్రకాశించుచున్నది. ప్రణుత...వాసితము - ప్రణుత=మిక్కిలినుతింపఁబడిన, గుగ్గులు ధూపపటల = గుగ్గిలపు ధూపములసమూహముచే, వాసితము=వాసనగలదిగా చేయఁబడినది. పటహ...రవము - పటహ=తప్పెట, భేరీ=నగారాలు, శంఖ=చిందములు, పణవ=చిన్నతప్పెటలు, మృదంగ=మద్దెలలు, పటుఘంటికా = గొప్పగంటలు, అనేక = పెక్కులైన, బహు=నానావిధములైన, వాద్య=వాద్యములయొక్క, రవము=ధ్వని, గలది. కాంతా...శోభితము - కాంతా = స్త్రీలచేత, సమర్పిత = అర్పింపఁబడిన, కర్పూరశకల = కప్పురపు తునుకలచేత, కాంత=మనోజ్ఞమైన, నీరాజన =నివ్వాళులయొక్క, కాంతి=ప్రకాశము చేత, శోభితము=ఒప్పునది. అగణిత...

నగణితకనకకుంభాభిరామంబు
నగు విశ్వనాథమహాదేవునగరుఁ
జేరి యాదేవుని శ్రీలింగమూర్తిఁ
గోరి సద్భక్తి నెక్కొనఁగ దర్శించి
ధరణిఁ జాఁగిలి మ్రొక్కి తనమోడ్పుఁగేలు
గర మొప్ప ఫాలభాగంబునఁ జేర్చి
జయ భక్తమందార సజ్జనోద్ధార
జయ సద్గుణాధార సంసారదూర
జయ సత్కృపాలోల శాతత్రిశూల
జయ హుతాశననేత్ర జలజాక్షమిత్ర
జయ మేరుకోదండ జయ విష్ణుకాండ
జయ నిర్జితానంగ శశిధవళాంగ
చారుకోమలహాస చతురవిలాస
గౌరీమనోల్లాస కాశీనివాస
యీకాశికునిబుణం బీకాశిలోన
దీకొని తీర్పఁగాఁ దెరువు గల్పింపు'

---

రామంబు - అగణిత=లెక్కింపరాని, కనకకుంభ=బంగారుకలశముల చేత, అభిరామంబు=మనోజ్ఞమైనది, భక్తమందార=భక్తులకు కల్పవృక్షమువంటివాఁడా, సజ్జన ఉద్ధార=సత్పురుషులను ఉద్ధరించువాఁడా, శాత=వాఁడియైన, హుతాశననేత్ర=నిప్పుకన్నుగలవాఁడా, జలజాక్షమిత్ర=విష్ణువునకు చెలికాఁడా, మేరుకోదండ=మేరుపర్వతము విల్లుగాఁగలవాఁడా, విష్ణుకాండ=విష్ణువుబాణముగాఁగలవాఁడా, నిర్జితఅనంగ = జయింపఁబడిన మన్మథుఁడుగలవాఁడా, శశిధవళాంగ = చంద్రునివలె తెల్లనిఅంగములు గలవాఁడా, చారుకోమలహాస = సొగసైె మృదువైన నవ్వుగలవాఁడా, దీకొని=ఎదుర్కొని-పూని, తెరువు=మార్గ

మని సన్నుతులు సేసి యచ్చోటు వాసి
మనమార నా చంద్రమతియును దాను
భుక్తి ముక్తులు రెండుఁ బోలంగ నొసఁగు
భక్తవత్సలుఁ గాలభైరవుఁ గొలిచి
భసితత్రిపుండ్రంబు ఫాలలోచనము
నిశితత్రిశూలంబు నీలకంఠంబు
భోగీంద్రహారంబుఁ బునుకకప్పెరయు
నాగకంకణమును నల్లనిమేను
మరులుకెంజడలును మణికుండలములుఁ
చిఱుగజ్జెమొలనూలు సింగినాదంబు
డాకాలిపెండెంబు డమరువుఁ గత్తి
రాకాసితలలతోరపువనమాల
సెలవిపైఁ జిఱునవ్వు చిలికెడుమోముఁ
గలిగి యుజ్జ్వలరత్నఖచితంబులైన
యోగవాగలు మెట్టి యొకపాద మూఁది

---

ము ఉపాయము, భసితత్రిపుండ్రంబు = బూదిమూఁడురేకలు, ఫాలలోచనము = నొసటికన్ను, నిశితత్రిశూలంబు = వాఁడియైనత్రిశూలము, భోగీంద్రహారంబు = సర్పశ్రేష్ఠుఁడైన వాసుకి అనెడుహారము, పునుకకప్పెర = కపాలపాత్ర, నాగకంకణము = సర్పముల కడియము, మరులు కెంజడలును = మోహముగొలిపెడు ఎఱ్ఱనిజటలును, చిఱుగజ్జె = చిన్నగజ్జెలు, సింగినాదంబు = పొడదుప్పికొమ్ముతో చేయఁబడిన యోగుల సుషిరవాద్యవిశేషము, డాకాలిపెండెంబు = ఎడమకాలిపెండేరమును, డమరుగము, రాకాసి...వనమాల-రాకాసితలల = రాక్షసుల శిరస్సులచేతనైన, తోరపు = పెద్ద, వనమాలయు, సెలవి = పెదవిమూల, ఉజ్జ్వలరత్నఖచితము = ప్రకాశించురత్నములచే పొదుగఁబడినది. యోగవాగ

